# వాస్తు విజ్ఞాన చంద్రిక

పర్యవేక్షణ

''వాస్తు విశారద'' గోరస వీరబ్రహ్మాచార్యులు

రచన

''వాస్తు సమ్రాట్'' ''జ్యోతిష మహార్ణవ''

''దైవజ్ఞ'' గోరస వీరభద్రాచార్యులు, ఎం.ఏ.,

శ్రీ గాయత్రీ జ్యోతిషాలయము

# విషయానుక్రమణిక

# ప్రకృతి - ప్రాణులు

'అగ్నీందు ద్యుమణిప్రభంజన ధరా నీరాంతరశ్యాయినీ
శక్తిబ్రహ్మహరీశవాసరముఖా మర్త్యాసురాత్మస్థితా
సృష్టిస్థావరజంగమ స్థితమహా చైతన్యరూపాచయా
యద్బీజ స్మరణేన సైవభవతీ ప్రాదుర్భవత్యంబకే
(త్రిపురసుందరీ మహిమ్నాస్తోత్రం)

భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతాలు తానుగా నిండి యున్నటువంటిన్ని, బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, సూర్యుడు మొదలగు దేవతలకు ఆత్మ స్వరూపిణి అయినటువంటిన్ని, సమస్త జగత్తునందలి స్థావర జంగమాది ప్రాణికోటికి బీజరూపిణియై మహా చైతన్య స్వరూపిణిగా భాసించుచూ బిందు రూపాత్మకమైన ఏ జగన్మాత, పరాశక్తి యనబడే ప్రకృతిమాత వ్యాపించి యున్నదో ఆపరా ప్రకృతికి నమోవాకముల ర్పించుకొనుచున్నాను.

ఈ పంచ భూతాత్మికమైన ప్రపంచములో అణువణువున నిండియుండి మహాశక్తి సంపన్నమైన ప్రకృతి స్వరూపిణియగు జగన్మాతయే ఈ దృశ్యమాన జగత్తునకు బీజము. సూక్ష్మ రూపముగానున్న మఱ్ఱి విత్తనమున మహా వట వృక్షము యే విధముగా యిమిడి యుండి అవసరమగునపుడు ఏ విధంగా వ్యాప్తి చెందుచున్నదో అట్లే ''ప్రకృతిశక్తి'' అనే బీజమునుండి ఈ దృశ్య మాన జగత్తంతయు ఆవిర్భవించి వ్యాప్తి చెందుచున్నది. ప్రకృతిమాత, కొన్ని అ నుల్లంఘనీయమైన నియమములు ఆధారంగా చతుర్దశ భువనాలను పరి పాలించుచున్నది

పంచభూతాత్మకమైన ఈ దృశ్యమాన జగత్తునందలి యే పదార్థమైనా ప్రకృతి నియమాలను లవ లేశమైనా జవదాటలేదు. సమస్త జీవరాశులు ఈ కాల చక్రభ్రమణంలోపడి తిరుగుతూ చావుపుట్టుకలు, ఉచ్ఛ నీచలు పొందుతూనే ఉన్నాయి. ఈ దృశ్యమాన జగత్తు పంచభూతాత్మకమైనదని గదా తెలిసి కొంటిమి. భూమి, నీరు, నిప్పు గాలి, ఆకాశం అనబడే ఈ పంచభూతాలు అణు రూపాలుగా ఆవిర్భవించి అనేక రూపాలు ధరించి ఈ సృష్టి చక్రాన్ని నడిపిస్తున్నాయి. అయితే ఈ పంచభూతాత్మకమైన అణు సముదాయం అన్ని పదార్థాలయందు సమపాళ్ళలో కూడియుండవు. అందుచేతనే ఈ సృష్టిలో ఏ రెండు వస్తువులు ఒకే తీరున రూపొందవు. ఈ కోట్లాది మానవులలో ఏ యిరువురు మానవులూ ఆకృతిలోగాని రంగులోగాని, గుణగణాలలోగాని వ్యక్తిత్వంలోగాని ఒకేవిధంగా ఉండరు ఏరెండు పదార్థాల స్వరూప స్వభావాలు ఒకేవిధంగా ఉండవు ఉండజాలవు కూడా.

ఈ పంచభూతాత్మకమైన ప్రకృతియంతా అనిర్వచనీయమైన, అనూహ్యమైన, అనుల్లంఘనీయమైన కొన్ని కొన్ని నియమాలు ఆధారంగా కాల చక్రభ్రమణంలోబడి పరిభ్రమిస్తూ, సమస్త ప్రాణికోటులను ఆయా దేశ కాల పరిసరాల ప్రభావాలకు అనుగుణంగా ప్రభావితం చేస్తూ ఉంటుంది

ప్రకృతి అని పిలువబడే ఈ పరిసరాల ( భావానికి, ప్రభావితంగాని ప్రాణి అంటూ ఉండదు మానవులందరూ పరిసరాల ప్రభావానికి దాసోహం అనవలసిందే. ఆ విధంగా పరిసరాల, ప్రకృతి ప్రభావానికి లోనైన మానవుని మనస్సుకూడా తదనుగుణంగా నడచు కొంటుంది. పశుపక్ష్యాదులు కూడా ప్రకృతి జన్య ప్రభావానికి లోనై ప్రవర్తిస్తాయి ఉదాహరణకు ఆకాశంలో మేఘాలు ఆవరించియుంటే నెమళ్ళు పరవశించి నాట్యం చేస్తాయి. సూర్యరశ్మి సోకగానే పద్మాలు వికశిస్తాయి. చంద్రుని కాంతికి కలువపూలు విచ్చుకుంటాయి ఇలా చాలా ఉదాహరణలు చెప్పవచ్చును.



# మానవజాతులు - పరిసరాల ప్రభావము

ఆదిమ మానవ గణాలు అడవులలో తిరుగాడుతూ, కాలక్రమంలో వ్యవసాయం ముఖ్య వృత్తిగా స్వీకరించి, క్రొత్తగా సుఖ జీవనం సాగించడానికి నాంది పలికాయి. సుఖ జీవన విధానాలకు ప్రాతిపదిక స్థిరనివాసం. ఈ స్థిర నివాసానికి ప్రాతిపదిక వ్యవసాయం. ఈ పరస్పర ఆశ్రయ సాధనాలైన వ్యవ సాయము, స్థిరనివాసము అనేవాటికి జన పదాలు అనబడే గ్రామాలు ఆశ్రయం కదా. అట్టి జనపదాలు ఏర్పడడానికి, అవి అభివృద్ధి చెందడానికి, కొన్ని వృత్తులు ఆవిర్భవించాయి.

అందులో కమ్మరం, వడ్రంగి, పాత్రల నిర్మాణం, గృహ నిర్మాణం, ఆభరణాదులు నిర్మించేవృత్తి, ఈ ఐదు వృత్తులు ఆధారంగా వస్తునిర్మాణం, మట్టిపాత్రల నిర్మాణం మొదలైన ఇతర ఉపవృత్తులుకూడా రూపొందాయి ఈ గ్రామీణ వృత్తులు జనపదాలు సుఖ జీవనం సాగించడానికి ముఖ్యమైతే, కమ్మరం వడ్రంగం వ్యవసాయానికి ప్రాణం ఈ విధంగా పరస్పరాశ్రయభూతాలైన వృత్తులు జనపదాలుగా, గ్రామాలుగా ఏర్పడ్డాయి. పైన పేర్కొన్న వృత్తులన్నీ వంశపారం పర్యంగా ఎంతో అభివృద్ధిని సాధించాయి వృత్తిదారుల సంఘాలు ఆనాటి సమాజంలో మంచి పట్టును సాధించాయి.

ఆ విధంగా అభివృద్ధిని సాధించి యున్న ఆదిమానవ జాతులకు చెందిన కొందరు ఋషులు, అనేక శ్రమలకోర్చి, తపస్సులు చేసి, అతీంద్రియ శక్తులను సంపాదించారు ఆనాటికి తమకు అందుబాటులోనికి వచ్చిన భౌతిక శక్తులతో తృప్తిచెందక, ప్రకృతినే ప్రయోగశాలగా, తమకుగల అతీంద్రియ శక్తులే ప్రయోగ సాధనాలుగా, అనేక పరిశోధనలు చేశారు. తర తరాలుగా ఆనాటి వరకు తమకు అందిన విజ్ఞానం ఆధారంగా, ఆనాడు తమ పరిశోధనా ఫలితాలను బేరీజు వేసుకొని , తాము తృప్తి పొందిన సిద్ధాంతాలు ప్రాతిపదికగా, కొన్ని శాస్త్రాలు ఆవిష్కరించారు అట్టి శాస్త్రాలలో ఖగోళ శాస్త్రం గణిత శాస్త్రం, జ్యోతిష శాస్త్రం, రసాయన శాస్త్రం, వైజ్ఞానిక శాస్త్రం, వాస్తు శాస్త్రం మొదలైనవి ముఖ్యమైనవి

పైన ఉదహరించిన శాస్త్రాలలో వాస్తు శాస్త్రం, క్రీస్తు శకం పదిహేను వేల సంవత్సరాలకు పూర్వమే, మొహంజదారో నాగరికత వ్యాప్తిలో ఉన్న నాటికే, మన దేశంలో వ్యాప్తిలో ఉన్నదనడానికి చారిత్రకాధారాలు ఉన్నాయి. మనము నివసించే ఈ భూగోళం మహాసముద్రాలు, భూఖండాలతో సహితంగా, అనంత విశ్వాంతరాళంలో గిర్రున తిరుగుతూ తేలి-యాడుతూ ఉంది ఈ భూగోళం 3550 కి మీ. వ్యాసం కలిగి వుంది. ఈ భూగోళానికి రెండు రకాలైన చలనాలున్నాయి. ఒకటి భూభ్రమణం, రెండవది భూపరిభ్రమణం.

ఈ భూగోళం బొంగరము వలె తన చుట్టూ తాను తిరుగుతూ ఉండడాన్ని భూభ్రమణం అంటారు. దీని వలన మనకు రాత్రింబవళ్ళు ఏర్పడుతుంటాయి. భూగోళం తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూతిరగడానికి భూపరిభ్రమణం అంటారు. భూమి, సూర్యుని చుట్టూ ఒకసారి తిరిగి రావడానికి 365.4 రోజులు, అనగా ఒక సంవత్సర కాలం పడుతుంది.

ఈ భూపరిభ్రమణ వేగం ఒక నిముషానికి 1100 మైళ్ళు. ఈ భూపరిభ్రమణ కారణంగా మనకు ఋతువులు ఏర్పడుతున్నాయి. మనము నివసించే ఈ భూగోళం, విశ్వాంతరాళంలో బొంగరం వలె 24 గంటల కాలంలో, తన చుట్టూ తాను తిరుగుతూ, నిముషానికి 1100 మైళ్ళ వేగంతో 365.4 రోజులలో, సూర్యగోళాన్ని ఒకసారి చుట్టి వస్తుందని మనకు తెలుసు కదా. అయితే, ఈ భూగోళం యొక్క అక్షం 23 5 డిగ్రీలు వాలి ఉంది. ఆకారణంగా ఈ భూగోళం యొక్క అన్ని ప్రాంతాలలోని ఒకే విధమైన శీతోష్ణస్థితులు ఏర్పడక, వివిధ దేశాలలో, వివిధ కాలాలలో, వివిధ రకాలైన ఋతు ధర్మాలు కలుగుతున్నాయి. అంతేకాదు, సూర్యోదయాస్తమయ కాలాలలోకూడ చాలా వ్యత్యాసాలు ఏర్పడుతున్నాయి. మన భారతదేశంలోనే ఒకచోట ఎండలు మండిపోతుంటే, మరోచోట వరదలువచ్చి పడుతున్నాయి.

మన భారతదేశంలో మధ్యాహ్నకాలం 12 గంటలైనదనుకొంటే, అదే సమయంలో, లండన్‌లో సా 6-30 ని ॥లు అవుతుంది. అమెరికాలో రా 1-34 అవు

తుంది. ఈ విధంగా వివిధ దేశాలలో వివిధ శీతోష్ణస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ మార్పులన్నీ భూభ్రమణం మరియూ భూపరిభ్రమణమనే ప్రకృతి సిద్ధమైన నియమాల వల్లనే గదా జరుగుతున్నాయి. ఆ నియమాలే మనకు వరప్రసాదం.

ఈ విధంగా భూభ్రమణ, భూపరిభ్రమణములనే కారణంచేత, భూగోళం మీద, పర్యావరణ ప్రకృతి మరియు పరిసరాలయందలి అనేక మార్పులచేత భూమండలం మీద వివిధ దేశాలలో నివసించే మానవ జాతుల ఆకృతులు, గుణగణాలు, స్వభావాలు, శారీరకమైన రంగులు, ఒక్కొక్క దేశంలో ఒకో విధంగా రూపొందాయి. జీవరాసుల మీద, ప్రత్యేకంగా మానవజాతుల మీద, పరిసరాల ప్రభావం ఇంతింతనడానికి వీలులేనిది.

పరిసరాల ప్రభావం అనేది ప్రకృతి చేతిలోని చాలా శక్తివంతమైన సాధనం. ఈ క్రింది విషయాలు గమనించండి.

ఈ భూగోళం మీద నాలుగింట మూడువంతుల భాగం మహాసముద్రంతో నిండి ఉంది. ఒక వంతు భాగంలో ఆసియాఖండం. ఐరోపాఖండం, ఆఫ్రికాఖండం, ఉత్తర అమెరికాఖండం, దక్షిణ అమెరికాఖండం, ఆస్ట్రేలియా ఖండం, అంటార్కిటికాఖండం అనే భూఖండాలుగా ఏర్పడి ఉంది. అందు ఆసియాఖండంలో ఒక ఉపఖండం అనడానికి తగిన లక్షణాలు మన భారత దేశం కలిగి ఉంది.

భారత దేశానికి తూర్పున బంగాళాఖాతం, దక్షిణాన హిందూ మహాసముద్రం, పడమర అరేబియాసముద్రం, ఉత్తరాన ఎత్తైన హిమాలయ శిఖరాలు సరిహద్దులుగా ఉన్నాయి. ఈ మన భారత దేశంలో వివిధ ప్రాంతాలలోని ప్రజలు వేరు వేరు భాషలు, వేరు వేరు సంస్కృతులు, వేరు వేరు ఆచార వ్యవహారాలు కలిగి ఉన్నారు. దీనికంతటకు కారణం పరిసరాల ప్రాకృతిక ప్రభావమే అని చెప్పక తప్పదు. గమనించండి

1. గోదావరి పరీవాహకప్రాంతం: ఈ గోదావరీ పరీవాహక ప్రాంతీయులు తపశ్శక్తి సంపన్నులు, ఆత్మజిజ్ఞాసాపరులు, సాత్వికగుణ సంపన్నులుగా గుర్తింపబడుచున్నారు. వీరుసత్వగుణప్రధానులు

2. కావేరీ పరీవాహక ప్రాంతం ఈ ప్రాంతీయులు సంగీత ప్రియులు, రజోగుణాధిక్యము కలవారు, లౌకికత్వముతోకూడిన ఆత్మజిజ్ఞాస కలవారు.

3. గంగానదీ పరీవాహకప్రాంతం· ఈ ప్రాంతీయులు శుద్ధ సత్వగుణ సంపన్నులు, తపోనిష్ఠాగరిష్టులు. ఆత్మజిజ్ఞాసయే వారి ఆదర్శం.

4. సీమాప్రాంతం. సరిహద్దుప్రాంతములైన కాశ్మీరము, పంజాబు, అస్సాము మొదలగు పర్వత సీమప్రాంతములలో నివసించేవారు, ధృడకాయులు, తమోగుణప్రధానులు, శౌర్యబల పరాక్రమసంపన్నులు, యుద్ధప్రియులు

సాముదాయకముగా· భారతీయులందరు భౌతికశక్తులకంటె ఆధ్యాత్మిక శక్తుల మీదే నమ్మకము కలవారు. లోక కళ్యాణమే పరమాదర్శముగా భావించువారు. అనేక భాషలు మతాలు సాంప్రదాయాలు, ఆచారాలు అవలంబిస్తున్న వారైనా భిన్నత్వంలోనే ఏకత్వం సాధించిన ఘనత భారతీయులకు దక్కింది. స్వాతంత్ర్య ప్రియత్వం భారతీయులకు ఆజన్మసిద్ధమైనది

ఆ విధంగానే యూరోపియనులకు, అమెరికనులకు, ఆఫ్రికనులకు ఆస్ట్రేలియనులకు అనేకవిధములైన భేదాలు ఉన్నాయి. ఆకృతులలోను, ఆచారాలలోను, ఆదర్శాలలోను, రంగులోను ఒక దేశవాసులకు, మరో దేశీయులకు పొంతన లేదు. ఈ అన్నింటికి ప్రాకృతికమైన కారణాలే అధికం.

ఈ విధంగా మనం భౌగోళిక ప్రాకృతిక శక్తులను బాగుగా పరిశీలిస్తే, పరిసరాల ప్రభావమే, ఈ మానవ జాతుల మధ్యగల తారతమ్య భేదాలకు ఆధారమని గుర్తించగలం. పరిసరాల ప్రభావం మానవుల మేధాశక్తి మీద తిరుగులేని ఆధిపత్యాన్ని సంపాదించి శాసిస్తుంది. ఆయా దేశవాసుల జీవిత సరళిని విజ్ఞాన వికాసాలను ప్రభావితం చేస్తుంది.



# పరిసరాలు

పరిసరాలు రెండు విధాలు. సహజంగా ప్రకృతి సిద్ధమైన పరిసరాలు మరియు మానవ నిర్మితమైన పరిసరాలు. ఈ ప్రకృతిలో సహజంగా రూపొందిన సముద్రాలు, సముద్ర తీరాలు, నదులు, నదీతీరాలు, పర్వతాలు, గుట్టలు కోనలు, గుహలు, సరస్సులు, అడవులు, ఎడారులు, పచ్చిక బయళ్ళు, మైదానాలు మొదలైనవన్నీ సహజ ప్రకృతి పరిసరాలే.

ఈ సహజ ప్రాకృతిక పరిసరాలలో, పంచభూతాలకు చెందిన ఆధిపత్యం సమపాళ్ళలో ఉండకపోవచ్చును. కొన్ని చోట్ల ఈ పంచభూతాత్మికమైన భాగస్వామ్యంలో హెచ్చు తగ్గులు ఉండవచ్చును. ఆ కారణంచేత చిన్న చిన్న క్షేత్రాలలో, స్వల్పమైన పాంచ భౌతిక శక్తులు ఇమిడి ఉంటాయి. ఒక క్షేత్రంలో జలతత్వానికి ఆధిక్యత ఉంటే మరో క్షేత్రంలో అగ్నితత్వానికి ప్రాముఖ్యత ఉంటుంది. ఒకోచోట వాయుతత్వానికి ఆధిక్యత ఉంటే యింకోచోట ఆకాశ తత్వానికి ప్రాముఖ్యత ఉంటుంది.

ఈ విధంగా ఆయా క్షేత్రాల ఉనికినిబట్టి, ఆయా పరిసరాల ప్రభావాన్నిబట్టి, ఆయా క్షేత్రాల భౌతిక శక్తులు, ఆయా క్షేత్రాలలో నివసించే ఇతర ప్రాణుల మీద తమ శక్తిని ప్రసరింపజేస్తూ ఉంటాయి. తత్కారణంగా, ఆయా ప్రాంతీయ క్షేత్రాలలో నివశించే మానవుల మనసులు, ఆయా పరిసరాల ప్రభావానికి లోనవుతూ ఉంటాయి.

నదీ తీరాలలో నివసించే మానవుల అభిరుచులు, అలవాట్లు, గుణగణాలు స్వభావస్వరూపాలు, ఆయా పరిసరాలకు అనుగుణంగా ఉంటాయి. అట్లే అడవులు, కొండలు కోనలు గల క్షేత్రాలలో నివసించేవారి అలవాట్లు, అభిరుచులు, గుణగణాలు స్వరూపస్వభావాలు, ఆయాప్రజల జీవన విధానం, ఆయా ప్రాంతీయ పరిసరాలకు అనుకూలంగా రూపొందుతుంది అనడంలో

ఏమీ సందేహం లేదు. ఆ విధంగానే సముద్ర తీర ప్రాంతాలు అడవులు గల క్షేత్రాలలో నివసించేవారి అభిరుచులు మొదలగునవి ఆయా పరిసరాలకు అను గుణంగా రూపొందక తప్పదు. ఎడారులలో నివసించేవారు, తదితర క్షేత్రాలలో నివసించేవారు, పరిసరాను గుణంగా మారుతుంటారు. పిండితార్థం ఏమి టంటే ప్రాకృతిక శక్తుల ప్రభావం మానవ మస్తిష్కం మీద ఆధిపత్యం వహించి, మానవుణ్ణి పరిసరాల ప్రభావానికి లోను చేస్తుంది. భూమి పైన జీవించే సమస్త చరా చర జగత్తు, పరిసరాల ప్రభావానికి లోనగుతూ ఉంటుంది

అయితే, లోక కళ్యాణమే పరమావధిగా భావించిన శాస్త్ర కర్తలైన కొందరు ఋషులు, ధర్మార్థకామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధిం చడానికి, అనువైన జీవితం గడపడానికి తమ తమ అతీంద్రియ శక్తుల తోడ్పా టుతో కొన్ని సాధనాలు ఆవిష్కరించారు.

అట్టి సాధనాలలో, సహజ ప్రాకృతిక క్షేత్రాల మాదిరిగానే, మానవుడు సుఖ సంతోషాలతో జీవితం గడపడానికి వీలైన కృత్రిమ, ప్రాకృతిక క్షేత్రాలు ముఖ్యమైనవి ఈ క్షేత్రాలలో కూడా పాంచ భౌతిక శక్తులు ఏ ఏ పాళ్ళలో మేళవించాలో ఆయా పాళ్ళలో పాంచ భౌతిక శక్తులను ఆవిష్కరించి, మాన వుల సుఖ జీవన విధానానికి దోహదపడేలా, తమ తమ అతీంద్రియ శక్తుల సహాయంతో కొన్ని నియమాలను సూత్రీకరించారు. ఆ నియమాల నిలయమే మన ' వాస్తుశాస్త్రము''.

అట్టి శాస్త్రకర్తలలో విశ్వకర్మ మయుడు, త్వష్ట్ర కశ్యపుడు, భరద్వా జుడు భృగువు, మానసారుడు, అగస్త్యుడు మొదలగువారు సుప్రసిద్ధులు. వీరందరు లోకకళ్యాణమే పరమావధిగా ఈ శాస్త్రాలను రూపొందించి భావి తరాల వారికి అందించారు. అట్టి ఋషి శ్రేష్టులలో మయబ్రహ్మ సుప్రసిద్ధుడు మహాభారతంలో మయసభా భవన నిర్మాణంతో అతని కృత్రిమ ప్రాకృతిక పరిసరాల నిర్మాణ కౌశలం పరాకాష్ట పొందింది

అట్టి మయబ్రహ్మ రచనలలో, 'మయ మాయ', 'మయ జయము', అనునవి ఏ నాడో జర్మనీ దేశము చేరినవని లోకోపవాదం. మిగిలిన రచనలలో మయ మతం అనే వాస్తుశాస్త్ర గ్రంధం గొప్పది. దీనిని పాండిచ్చేరి ప్రభుత్వం ఫ్రెంచి భాషలో అచ్చు వేయించింది. మూల గ్రంథం నాగరీ లిపిలో ముద్రించారు. ఇందుగల వాస్తు శాస్త్ర విషయాలు ఆంధ్రులకు సమగ్రంగా అందుబాటుకు రాలేదు. ఈ మయ బ్రహ్మయే, ఈనాటి పంచాంగ రచనకు ప్రామాణిక గ్రంధమైన 'సూర్య సిద్ధాంతం' గ్రంధ కర్త. ఈనాటికీ పంచాంగ రచన సూర్య సిద్ధాంతం ఆధారంగా కొనసాగుతుంది.

మన వాస్తు శాస్త్రం ఆధారంగా, మానవులు సుఖంగా జీవించడానికి, చతుర్విధ పురుషార్ధసాధనకు అనువైనకృత్రిమ, ప్రాకృతికపరిసరాలుగల క్షేత్రాలు నిర్మించుకొనవచ్చునని తెలిసికొంటిమిగదా! అట్టి క్షేత్రాలకే ''వాస్తువు'' అని పేరు.

మనం ఏదైనా నగరం గాని గ్రామం గాని, ఆశ్రమం గాని, గృహం గాని నిర్మాణం చేయాలని తలపెట్టినపుడు ఆయా నిర్మాణయోగ్యమైన స్థలాన్ని దిశలకు సరిగా సవరించి, సరిహద్దులు సవరించినస్థలాన్ని ''వాస్తువు'' అంటారు. అట్టి వాస్తు క్షేత్రమునందు మానవ సుఖ జీవనానికి పాంచభౌతిక విలువలకు, అనువైన రీతిలో రూపకల్పనచేయాలి. అట్టి క్షేత్రాలనే మనం కృత్రిమ ప్రాకృతిక పరిసరాలని అంటాం. వీటి అన్నింటికి ఋషిప్రోక్తమైన భారతీయ వాస్తు శాస్త్రం ప్రాతిపదికగా వుంటుంది.



# మనభూగోళం - దిక్కులు

పంచ భూతాలు సృష్టికి ఆధారభూతాలు. అయితే అందు మొదటిదైన భూగోళం వాస్తుకు ముఖ్యాధారం. మనం భూగోళం మీద నివసిస్తున్నాం కాబట్టి, ఆ భూగోళానికి సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు సంక్షిప్తంగా తెలుసుకొందాం.

ఈ భూమి దాదాపు సంపూర్ణ గోళం దాని వ్యాసం 7900 మైళ్ళు చుట్టుకొలత 25000 మైళ్ళు. భూమధ్యరేఖ వద్ద కొంచెం లావుగాను ధృవాల దగ్గర కొంచెం వత్తబడి ఉంటుంది. ఈ భూగోళానికి రెండు విధాలైన చలనాలు న్నాయని తెలుసు, అవి భూభ్రమణం, భూపరిభ్రమణం. భూమి గుండ్రంగా ఉన్నందువ ఎప్పుడైనాసరే భూమిలో సగ భాగానికి మాత్రమే సూర్యకిరణాలు ప్రసరిస్తాయి, ఆ కాలం పగటికాలం. మిగతా సగ భాగం చీకటి. భూమి పడమర నుండి తూర్పు దిశగా తిరుగుతూ ఉన్నందు వలన సూర్యోదయం తూర్పున అయినట్లు సూర్యాస్తమయం పడమర అయినట్లు కనిపిస్తుంది. ఈ భూమి గోళాకారంగా ఉండడం వలన ఏదైనా ఒక స్థానాన్ని గుర్తించాలంటే ఏదో ఒక నిర్దేశం ఉండాలి. భూమి తన చుట్టూ తాను బొంగరంవలె తన మీద తిరుగుతు న్నందువలన అక్షం కొనలను ఉత్తర, దక్షిణ ధృవాలుగా శాస్త్రవేత్తలు గుర్తిం చారు. ఆ ధృవాలను ఆధారంగా చేసుకొని భూమి మీద కొన్ని ఊహా రేఖలను గీసుకొని, భూమి మీద ఏ స్థానాన్నయినా గుర్తించడానికి సులభ మార్గం గ్రహిం చారు. ఈ ఉత్తర, దక్షిణ ధృవాల దగ్గర భూగోళం కొద్దిగా నొక్కబడి ఉంటుం దని తెలుసు. అయితే భూగోళం యొక్క ఉత్తర ధృవం దగ్గర నిలుచుండి తల పైకెత్తి ఆకాశంలోకి చూస్తే ఆకాశంలో కదలకుండా దిగగొట్టిన మేకు వలె తళ తళలాడుతూ కనిపించేదే ధృవతార. ఆ ధృవతార ఆకర్షణ శక్తికి లోనై నిముషా నికి 1100 మైళ్ళ వేగంతో ఈ భూగోళం అండాకారమైన ఒక నిర్ణీత కక్ష్యలో సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నప్పటికి భూగోళం యొక్క ఉత్తర ధృవ ప్రాంతం, ఉత్తరాకాశంలో ధృవతార పరస్పరాశ్రయాలై ఉంటాయి. అంటే

అన్ని ఋతువులలోనూ, అన్ని వేళలా, ఉత్తర ధృవం దగ్గర ధృవతార నడినెత్తి మీద ప్రకాశిస్తూనే ఉంటుంది. ఆ విధంగా భూగోళానికి ఖగోళంలో కొన్ని కోట్ల మైళ్ళ దూరంలో ఉన్న ధృవ మండలానికి, ఆ విధమైన విడదీయరాని సంబంధం ప్రకృతి సిద్ధంగా ఉంది. అంటే ధృవ నక్షత్రానికి భూగోళానికి అంతటి మహత్వ పూర్ణమైన సంబంధం ఉన్నది.

భూగోళం మీద, భూమధ్యరేఖా ప్రాంతంలో నిలబడి, ఖగోళం వైపు దృష్టి సారిస్తే ఉత్తరాకాశంలో సప్తర్షి మండలం దిగువన, రాత్రి కాలంలో ఏ సమయంలో చూసినా ధృవతార ఒకేచోట ఉంటుంది. కాబట్టి ఈ భూగోళానికి ధృవతార కనిపించే దిశ ఉత్తర దిశ అని మనం గుర్తించగలం.

ఈ రేఖాంశాలను కూడా లెక్కించడానికి ఒక ప్రారంభం కావాలి. అందుకుగాను దానికి వ్యతిరేక దిశ ఖచ్చితంగా దక్షిణ దిశ అగును. ఈ విధంగా భూగోళానికి ప్రకృతి సిద్ధమైన ఉత్తర దక్షిణ దిశలు అతి తేలికగా గుర్తించ గలము

ఈ భూగోళం మీద మనకు కావలసిన చోటును గుర్తించడానికి వైజ్ఞానికులు కొన్ని ఊహా రేఖలు గుర్తించారు. ఉత్తర దక్షిణ ధృవాలకు మధ్యగా గీసిన ఊహా రేఖ భూమధ్య రేఖ. భూమధ్య రేఖకు ఉత్తరంగా 23.50 డిగ్రీల దూరంలో గీసిన గీత కర్కాటకరేఖ, దక్షిణంగా 23.50 డిగ్రీల దూరంలో గీసినరేఖ మకర రేఖ. ఈ విధంగా భూమధ్య రేఖ నుండి ధృవాల వరకు గీసిన సమాంతర రేఖలను అక్షాంశరేఖలని పిలుస్తారు.

ఆ విధంగానే భూమి చుట్టూ భూమధ్యరేఖను ఖండిస్తూ లంబంగా ధృవాలగుండా గీసిన ఊహా రేఖలను రేఖాంశాలని అంటారు ఈ విధంగా భూమధ్య రేఖపై 360 డిగ్రీల రేఖాంశాలున్నాయి అయితే ఈ రేఖాంశాలను కూడా లెక్కించడానికి ఒక ప్రారంభం కావాలి.

కాబట్టి లండన్‌లోని గ్రీనిచ్ గ్రామం మీదుగా పోయే రేఖాంశాన్ని సున్నా రేఖాంశగా తీసుకొన్నారు గ్రీనిచ్ రేఖాంశానికి తూర్పుగా 180 డిగ్రీలు పడమరగా 180 డిగ్రీలు లెక్క కట్టారు.

భూమి యొక్క ఉత్తర దక్షిణ ధృవాల ఆధారంగా, ఉత్తర దక్షిణ దిశలు ఎట్లు సులువుగా గుర్తించగలిగామో అట్లే ఈ రేఖాంశాలు ఆధారంగా భూగోళం మీద మొదట ఏ దిశలో సూర్యోదయం అవుతుందో ఆ దిశ తూర్పు దిక్కుగాను దానికి వ్యతిరేకమైన దిశ పడమర దిశగాను నిర్ధారణ అవుతుంది. భూమి పశ్చిమం నుంచి తూర్పునకు తిరుగుతూ ఉన్నందున తూర్పున గల రేఖాంశం మీద సూర్యోదయం అవుతుంది. భూమి తన చుట్టూ తాను ఒక పర్యాయం తిరగడానికి 24 గంటల కాలం పడుతుంది

కాబట్టి ఒక్కొక్క రేఖాంశాన్ని దాటడానికి 4 నిముషాల కాలం పడుతుంది ఈ విధంగా భూగోళం మీద భూమి గోళాకారంలో ఉన్నప్పటికి మనం కోరిన క్షేత్రంలో దిశలు ఏ విధంగా గుర్తింపగలమో తెలుసుకొంటిమి నాలుగు దిశలు గుర్తించ గలిగినపుడు నాలుగు విదిక్కులు సులువుగా గుర్తించ గలం.

అయితే వాస్తు శాస్త్రానికి సంబంధించినంత వరకు మరొక ప్రశ్న ఉదయిస్తుంది ఉదాహరణకు ఒకచోట 500 చదరపు గజముల స్థలం చతురస్రాకారపు క్షేత్రం ఉంది. దానికి తూర్పు దిశగా అంతే విస్తీర్ణముగా గల మరొక క్షేత్రం ఉన్నది. ఒకటవ క్షేత్రానికి తూర్పు రెండవ క్షేత్రానికి పడమర అగును. అది ఎలా సంభవిస్తుంది అన్నది ప్రశ్న

ఈ భూగోళం మీద మానవుడు ఏ బిందువుపై నిలబడి చూచినా ఆ బిందువునకు మాత్రమే నాలుగు దిశలు, విదిశలు, గుర్తించడం వైజ్ఞానిక పద్ధతి. కాబట్టి మొదటి క్షేత్రానికి మధ్య బిందువు దగ్గర నిలబడి, ఆ క్షేత్రపు తూర్పు రేఖ నిర్ధారించినపుడు రెండవ క్షేత్రానికి మధ్య బిందువునందు నిలుచున్నవానికి మొదటి క్షేత్రపు తూర్పురేఖ రెండవ క్షేత్రమునకు పడమర దిశరేఖగా గుర్తించ గలడు ఈ సత్యం అందరకు స్పష్టము. కావున భూమి గోళాకారంగా విశ్వాంతరాళంలో ఎంతో వేగంతో పయనిస్తున్నప్పటికీ భూగోళం మీద మనం కోరుకొన్న బిందువు దగ్గర నాలుగు దిశలు విదిశలు గుర్తించగలరు. ఇదియే వైజ్ఞానిక పద్ధతి.



# భూమి - భౌతిక శక్తులు

భూగోళం దాని ఆకారాదుల గురించి కొంతవరకూ తెలిసికొన్నాం. అధర్వణ వేదంలోని పృధ్వీసూక్తంలో, భూగోళానికి సంబంధించిన అనేక వైజ్ఞానిక రహస్యాలు వర్ణింపబడి ఉన్నాయి. కొన్ని కోట్ల సంవత్సరాలకు పూర్వం సూర్యగోళం నుండి విడి వడి, ఆ సూర్యుని ఆకర్షణ శక్తి నుండి తప్పించుకొని, సూర్యగోళానికి ఉపగ్రహంగా మారిన ఒక అగ్నిగోళం ఈ భూగోళం. ఆ అగ్నిగోళం అనేకవేల సంవత్సరాల వరకు విశ్వాంతరాళంలో సూర్యుని చుట్టూ తిరుగుతూ తిరుగుతూ కొంత ఉష్ణశక్తిని కోల్పోయి చల్లబడింది. ఆ విధంగా ఈ భూగోళం నెమ్మది నెమ్మదిగా చల్లబడుతూ ఉంటే ఆ భూగోళ గర్భంలో ఉన్న బరువైన ఇనుము, నికెలు మొదలైన లోహ ఖనిజ ద్రవాలు భూకేంద్రం యొక్క గురుత్వాకర్షణ శక్తికి లోబడి, అనగా "ఫోర్స్ ఆఫ్ గ్రావిటీకి" లోబడి, భూగోళ మధ్యకేంద్రానికి చేరుకొన్నాయి. తేలికైన రాళ్ళు రప్పలు, ధూళి ఉపరి తలానికి చేరి కుదుటపడి దృఢంగా కూడి ఉండడంవల్ల భూమి పై పొరగట్టిపడి అరణ్యాలు వనాలు, సముద్రాలు మొదలైన ప్రకృతి స్వరూపం రూపొందడానికి ఆధారమైనది. ఋగ్వేదంలోని ఈ సూక్తం చూడండి

> "శిలా, భూమి, రశ్మి, పాంశు, సౌభూమి సంధృతాధృతా
> తస్యైహిరణ్యవక్షసే పృధివ్యాఅకరంనమ:"

పై మంత్రం, భూమి యొక్క బాహ్య స్వరూపాన్ని వివరిస్తుంది. భూకేంద్రంలో ఏర్పడిన వివిధ లోహ ఖనిజ ద్రవాల కూడిక, అంతర్గత ఉష్ణ శక్తికి లోబడి, కుత కుత లాడుతూ, భూగోళం యొక్క ఆత్మభ్రమణ వేగం చేత అనేక వత్తిళ్ళకు లోనై బాగా మధింపబడి సుళ్ళు తిరుగుతూ అనంతమైన విద్యుత్ప్రవాహాలను విరజిమ్మబడుతూ ఉంటుంది. ఆ విద్యుత్ప్రవాహాల నుండి అయస్కాంత క్షేత్రాలు ఆవిర్భవిస్తాయి. ఆ అయస్కాంత క్షేత్రాలనుండి ప్రాణుల

మనుగడకు అవసరమైన జీవశక్తి భూమి యొక్క ఉపరితలం మీద ఎల్లెడల విరజిమ్ముతూ ఉంటుంది

ఆ జీవశక్తి ప్రభావం చేతనే అరణ్యాలు, వనాలు, సమస్త జీవరాశులు అవతరించాయి. సమస్త జడ చేతనాలకు ఆ జీవశక్తియే పుట్టిల్లు భూమాతకు కూడా ఆ జీవశక్తియే ఆత్మ శక్తి.

ఇక భూగోళానికి గల ఆకర్షణ శక్తి, పైతృకంగా సూర్యగోళాన్నుండి సంక్రమించింది. ఈ భూగోళం పై పొర గట్టిబడడంతో యేర్పడిన ధాతువుల నుండి, ఖనిజాల నుండి ఇతర మూలకాల నుండి కూడ ఈ ఆకర్షణశక్తి వృద్ధిపొంది భూమ్యాకర్షణ శక్తిగా రూపొందింది. ఈ భూమ్యాకర్షణ శక్తి లేకపోతే మనం ఈ భూమి మీద స్థిరంగా జీవించే అవకాశం లేదు. గాలిలో యేమూలకో ఎగిరిపోయేవాళ్లం.

ఈ భూమండలానికిగల బలీయమైన అయస్కాంత క్షేత్రాల ప్రభావం చేత ఈ భూగోళం చుట్టూ కొన్ని మైళ్ళ వరకు ఈ అయస్కాంత శక్తి వ్యాపించి ఉంటుంది. అంతేగాక భూగోళపు ఉత్తర దక్షిణ ధృవాల మీదుగా అయస్కాంత వలయాలు నిరంతరం ఎడతెగక పరిభ్రమిస్తూ ఉంటాయి. ఈ అయస్కాంత వలయాల ప్రభావం భూమి మీద నివసించే జీవరాసుల మీద అమితంగా ఉంటుంది. ఈ అయస్కాంత వలయాల తీరుతెన్నులకు జీవరాశుల జీవిత చక్రాల గమనాలకు విడదీయరాని సంబంధం ఉన్నదని ఆధునిక వైజ్ఞానికులు కూడా అంగీకరిస్తున్నారు

అప్పడపుడు సూర్య గోళంలో చెలరేగే తుఫానులకు, ఈ భూగోళం మీద విస్తరించియున్న అయస్కాంత మండలాలు అస్తవ్యస్తంగా తయారవుతా యని, ఆ రోజులలో భూమి మీద మానవ సమాజాలు మానసికంగా అనేక వత్తిళ్ళకు గురియవుతున్నాయని, సముద్రాలు పొంగి ఉప్పెనలు ఉపద్రవాలు పుడుతున్నాయని, భూకంపాలు, యుద్ధాలు సంభవిస్తున్నాయని ఆధునిక

వైజ్ఞానికులు ప్రకటిస్తున్నారు. ఈ అయస్కాంత శక్తి చేతనే భూమి మీద కట్టడాలు సురక్షితంగా ఉంటున్నాయని, ఈజిప్టు పిరమిడ్లే ఇందుకు సాక్ష్యమని అంటున్నారు.

ఈ అయస్కాంత వలయాల ప్రభావం ఉత్తర దిశకు తల పెట్టి నిద్రించే మానవుల మెదడు లోని విద్యుత్తరంగాలపై ఉంటుందని, అంతే కాకుండా శరీర ద్రవాలపై కూడా ఈ అయస్కాంత వలయాల ప్రభావం ఉంటుందని డా శారదా సుబ్రహ్మణ్యంగారు ది 5-01-1980న రాంచీలో జరిగిన సైన్సు మహాసభలో పరిశోధనా వ్యాసం సమర్పించారు. అంతేకాదు, ఈ అయస్కాంత ప్రభావాల హెచ్చు తగ్గుల వలన మానవుల మనస్సులలో సందిగ్ధమైన ఆలోచనలు, మానసిక ఉద్రిక్తతలు, అనారోగ్యం చోటుచేసుకుంటాయని ప్రతిపాదించారు. ఈ విషయాలన్నీ మన శిల్ప ఋషులు వేలాది సంవత్సరాలకు పూర్వమే గ్రంధస్థం చేసి ముందు తరాలకు అందించారు. నిర్దిష్టమైన ఉత్తర దిశను గుర్తించి ఆ ఉత్తర దక్షిణ దిశలకు అనుగుణంగా కట్టడాలు నిర్మించుకోవాలని ఉద్బోధించారు. కానీ మనం ఆ విషయాన్ని మూఢ నమ్మకంగా త్రోసి పుచ్చుతున్నాము.

మన ఆధునిక ఇంజనీర్లు ఈ దిక్సాధనా సిద్ధాంతాన్ని అనగా - సరైన ఉత్తర దక్షిణ దిశలకు అనుగుణంగా కట్టడాలను నిర్మించాలనే సిద్ధాంతాన్ని పూర్తిగా విస్మరిస్తున్నారు.

కాబట్టి భూమికి గల ఈ భౌతిక శక్తుల విలువలను గుర్తించి నిర్మాణ కార్యాలు చేపట్టాలని మన భారతీయ ఋషుల విజ్ఞానాన్ని మనం వినియోగించుకోవాలని సిద్ధాంతులు ముఖ్యంగా భారతీయ ఇంజనీర్లను కోరుతున్నారు



## అంతరిక్షంలో - అక్షయపాత్ర

ఈ దృశ్యమానచరాచర జగత్తునందలి జడచేతనాలన్నింటికి ప్రాణదాత సూర్యుడు. సూర్యుడు లేని జగత్తు శూన్యమే ఆ సూర్యుడు ఎట్టివాడనగా

సూర్యయేవ త్రిలోకస్య మూలం పరమ దైవతం
ఆదిత్యాజ్జాయతేవృష్టిః వృష్టేరన్నం తతఃప్రజా
సూర్యాత్ ప్రసూయతే సర్వం తస్మిన్నేవప్రలీయతే

అనే భవిష్య పురాణ వాక్యాన్నునసరించి, ఈ సమస్త చరా చర జగత్తునకు సూర్యుడే ఆధార భూతమైనవాడు సూర్యుని వలన మేఘాలు ఆవిర్భవిస్తు న్నాయి. మేఘాల వలన వర్షాలు కురుస్తున్నాయి వర్షాల వలన భూమండలం సస్యశ్యామలమై పంటలు పండుతున్నాయి. అడవులు చెట్లు చేమలు పండ్లు కూరలు సమస్త పదార్థాలు మనకు లభ్యమౌతున్నాయి. ఆహార పదార్థాలు అనే అన్నం వలన ప్రాణులు అభివృద్ధి పొందుతున్నాయి. చివరగా ఈ సమస్త జగత్తు ఆ సూర్య భగవానునియందే లీనమౌతున్నది. సూర్యుడు లేని ఈ జగత్తు సర్వ శూన్యం అని గ్రహించగలం

ప్రపంచంలోని అన్ని దేశాలలోను, అన్ని మతాలలోను, ఏదో ఒక రూపంలో సూర్యారాధన ఉంది. బైబిల్, ఖురాన్, జెంట్ అవేస్తా వంటి మత గ్రంథాలలోనుసూర్యునిగురించిప్రశంసలున్నాయి అమెరికాకుచెందినమెక్సికో దేశంలో కూడా సూర్య దేవాలయం ఉంది. జపాన్ చైనా దేశాలలో కూడా సూర్య దేవుని ఆరాధించేవారున్నారు భారతీయులలో చాలా మంది సూర్య భగవానుని దర్శించ కుండా మంచినీళ్ళు కూడాత్రాగని వారున్నారు. గాయత్రీ మంత్రం సూర్య దేవతాత్మకమైనదే రాత్రి కాలమంతా గాఢాంధకారంలో మునిగియున్న లోకానికి ఉషః కాలంలో అనంత చైతన్యమైన వెలుగు నింపి ప్రాణులలో నూతనచైతన్యాన్ని పాదుకొల్పి నిత్య జీవనరథం ముందుకు సాగడా నికి ఆధారభూతమైన సూర్యుణ్ణే ఆరాధించనివారుండరు.

అట్టి జగత్కర్త విశ్వకర్మ అయిన సూర్యభగవానుని భౌతిక రూపాన్ని గూర్చి పరిశీలిద్దాం.

సూర్య గోళవ్యాసం ఇంచుమించుగా 8,64,000 వేల మైళ్ళు. ఈ ఆదిత్యుడు స్వయంభువు. అంతరిక్షంలో అవిర్భవించిన అక్షయపాత్ర వంటి ప్రత్యక్ష దైవం. గ్రహాలన్నీ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉంటాయి. ప్రతి సంవత్సరం అక్షయపాత్ర నుండి 50 లక్షల కోట్ల మెగావాట్లకు పైగా శక్తి దశ దిశలకు వెదజల్లబడుతూ ఉంటుంది. కానీ ఆశక్తి భూమికి 47 వంతులు మాత్రమే చేరుతుంది. అయితే భూమికి చేరే శక్తి 25వేల భాగాలు అనుకొంటే అందులో కేవలం ఒక్క భాగం శక్తినిమాత్రమే మనం వినియోగించుకొంటున్నా మని వైజ్ఞానికులు అంచనా వేశారు. ఈ సౌర శక్తిని వినియోగించుకోవడంలో మనం ఎంతగా వెనుకబడియున్నామో ఊహించండి. ఈ సౌర శక్తి కామధేనువు లాంటిది. ఆధునిక కాలంలో సౌర శక్తి ఉపయోగించని వైజ్ఞానిక రంగంలేనే లేదు. ఈ సౌర శక్తి చేత వైజ్ఞానికులు అనేక అద్భుతాలు చేయిస్తున్నారు. వైర్‌లెస్‌లు, టీవీలు, ట్రాన్సిస్టర్లు, నీటిని శుద్ధి చేసే యంత్రాలు, ఎలక్ట్రానిక్ రంగంలో కూడా అనేక విధాలుగా ఈ సౌర శక్తి వినియోగపడుతుంది. ఆఖరుకు మనం నిత్యం ఉపయోగించే కాలుక్యులేటరు కూడా సౌర శక్తిని వినియోగి స్తున్నాం. వైద్యరంగంలోనూ, స్పుత్నిక్ రంగంలోను, ఈ సౌర శక్తి బాగా వినియోగ పడుతుంది. సామాన్య గృహిణి కూడా వంటకు, దీపాలకు, సౌర శక్తిని వాడుకొంటుంది. సౌర శక్తితో పని చేసే విద్యుత్ యంత్రాలు, జల యంత్రాలు వినియోగిస్తున్నారు. ఈ విధంగా సూర్యుడు వేయి విధాలుగా మనకుపయోగపడుతున్నాడు. అందుచేతనే మన ఋషులు సూర్యుణ్ణే 'సహస్రాంశా' అని కీర్తించారు.

ఈ సౌర శక్తిని గూర్చి భారతీయ శిల్ప ఋషులు, వేదాలలోను, పురాణాలలోను విపులంగా వివరించారు. ఉదా: మైసూరులో లభించిన భార ద్వాజ ''విమాన నిర్మాణ శాస్త్రంలో'' సౌర శక్తితో నడచే విమాన నిర్మాణ విధానం వర్ణించబడి ఉంది. అయితే ఈ నాటి పాశ్చాత్య వైజ్ఞానిక వెలుగుల్లో, కళ్ళు మిరుమిట్లు గొలిపిన భారతీయ వైజ్ఞానికులకు, మనకూ ఒక నిర్దుష్ట మైన, ప్రణాళికా బద్ధమైన విజ్ఞాన శాస్త్రాలున్నాయని నమ్మకం కలగడం లేదు. భారతీయ ప్రాచీన విజ్ఞానమంతా మూఢ నమ్మకంగాను, పుక్కిట పురాణం గాను తోస్తుంది.

## సౌరశక్తి - వాస్తుశక్తి

ఈ రోజులలో విజ్ఞానశాస్త్రవేత్తలంతా సౌర శక్తి వినియోగాన్నిగూర్చి విశేష ప్రచారం చేస్తున్నారు. సౌర శక్తి అంటే సూర్య కిరణాల నుండి మనకు లభించే శక్తి అని తెలుసుకున్నాం.

ఆ సౌర శక్తి అనేక రంగాలలో అనేక రూపాలలో మనకు ఉపయోగ పడుతుంది. సౌర శక్తి అనేది ఒక అక్షయపాత్ర. మనం ఎంత కాలం ఎన్ని విధాలుగా ఉపయోగించు కొన్నా ఆ సౌర శక్తి నిధులు తరగవు ఆ సౌర శక్తి వరప్రసాదంలో ప్రాణ వాయువు అనే ఆక్సిజన్ ఒకటి. అనుక్షణం సమస్త ప్రాణికోటికి ప్రాణవాయువు ( ఆక్సిజన్) అత్యవసరం. ప్రాణవాయువు పీల్చనిదే ఏ ఒక్క ప్రాణీ రెప్ప పాటుకాలమైనా జీవించదు. అలాటి ప్రాణవాయువు సూర్యకిరణాల నుండి మాత్రమే మనకు లభిస్తుంది. సృష్టిలో మరి ఏ యితర పదార్థాల నుండి లభించదు. మనం లోపలికి పీల్చుకొనే గాలిలో తేలియాడే అణు సముదాయం సూర్య కిరణాల నుండి లభ్యమయ్యే ప్రాణవాయువును తమలోనికి పీల్చుకొని నిలువ చేస్తాయి. మనం శ్వాసను లోనికి పీల్చు కొనేటప్పుడు ఆ ప్రాణవాయువుతో కూడిన అణు సముదాయం మన ఊపిరి తిత్తుల లోనికి ప్రవేశించి శరీరాన్ని శక్తివంతం చేస్తుంది. ఈ సూర్య కిరణాలు ప్రాణవాయువునేకాక ఎన్నో అమూల్యమైన ఔషధగుణాల లవణాలు, విటమినులు, పోషకశక్తులుగల అల్ట్రావైలెట్ కిరణాలు ఇన్‌ఫ్రారెడ్ కిరణాలనుకూడా విడుదల చేస్తాయి. ఈ కిరణ సమూహాలు మానవ జాతి మనుగడకు ఇతర ప్రాణులు వర్ధిల్లడానికి ఎంతో అవసరమైనవి. అయితే ఈ విధమైన సౌర శక్తి, వాస్తు శక్తిగా యేవిధంగా రూపాంతరం చెందుతుందో పరిశీలిద్దాం.

మయవిశ్వకర్మ మతానుసారం మానవులు తమకు నివాస యోగ్యంగా భావించి యెంచుకొన్న భూమికి ''వాస్తువు'' అని పేరు. అట్టి వాస్తువునకు అధి దేవత వాస్తు పురుషుడు. వాస్తు పురుషుడనగా సూర్యుడేనని శాస్త్రాలు చెపుతు న్నాయి.

''విశ్వకర్మా సహస్రాంశోః'' అనగా విశ్వకర్మయే సూర్యుడని శాస్త్ర ప్రమాణం. ఆ విధంగానే ''వాస్తోష్పతిర్విశ్వకర్మా'' అనగా విశ్వకర్మ అనగా వాస్తు పురుషుడనియు, వాస్తు పురుషుడనగా సూర్యుడనియు శాస్త్రాలు వివరిస్తు న్నాయి. వాస్తు పురుష గమనం కూడా సూర్య గమనాన్నీ అనుసరించే ఉంటుంది.

అతీంద్రియ శక్తి సంపన్నులైన విశ్వకర్మాది శిల్ప ఋషులు అనేక ఖగోళ పరిశోధనలు జరిపి యేయే కాలములయందు సూర్యకిరణ ప్రసారం యేయే రీతులలో జరుగుతుందో ఆయా కాలములందు ప్రసరించే సూర్యకిరణాల నుండి వెలువడే కాంతి తరంగాల ప్రభావం తరంగ ప్రసారదైర్ఘ్యం ఎట్టిదో, యే గుణాలు కలిగి ఉంటుందో, ఆ విధానమంతా వాస్తు పురుష స్వరూపం పేరుతో గుప్త పరచి మనకు అందించారు. కాబట్టి సూర్య కిరణ ప్రసార జన్యమైన సౌరశక్తి'' యే భూమి అనబడే వాస్తువు నందు వాస్తు పురుష స్వరూపమగు వాస్తుశక్తిగా రూపాంతరం చెందుతూ ఉంది. పిండితార్థమేమనగా ఈ భూమి అని పిలువబడే ''వాస్తువును'' వాస్తు క్షేత్రమందలి గాలిని సూర్య కిరణజన్య మైన శక్తి, శక్తివంతం చేస్తుంది. ఈ విధంగా సౌరశక్తి వాస్తుశక్తిగా రూపాంతరం చెందుతూ ఉంది భూమి అనగా గృహాది నిర్మాణాలకు దిక్సాధనాది పరిశోధన ద్వారా శుద్ధపరచి స్వీకరించిన క్షేత్రం. ఈ క్షేత్రాన్నే వాస్తువు అని గ్రహించాం. అట్టి క్షేత్రానికి వాస్తు పురుషుడు అధి దేవత. అయితే ఆకాశంలో వెలుగొందే వాస్తు పురుష స్వరూపుడైన సూర్యునికి భూమండలం మీద గల వాస్తువు అనే

పేరు గల క్షేత్రానికి అనుసంధాన మేవిధంగా యేర్పడుతుంది? అంటే కిరణ ప్రసారంచేత అని ఋజువైనది. ఈ ఆకాశ మండలం గల సూర్యుడనే వాస్తు పురుషునకు భూమండలం మీద గల వాస్తు పురుషునకు బింబ ప్రతిబింబ న్యాయం వర్తిస్తుంది. అందు చేతనే వారిద్దరికి అభేదం చెప్పబడినది. ఉదా: ఒకచోట ఒక నీటితో నిండిన వంద కుండలు వరుసలుగా పేర్చబడి ఉన్నాయని భావించండి. ఆకాశంలో వెలుగులు విరజిమ్మే సూర్య భగవానుడు ఆ కుండలయందు సంపూర్ణ సూర్యబింబముగా ప్రకాశిస్తాడు. పై విధంగానే ఆకాశంలో వెలుగొందే వాస్తు పురుషుడు భూమండలం పై వాస్తు క్షేత్రంలో వాస్తు పురుష స్వరూపుడుగా అంతర్హితుడై వ్యాపించియుండి వాస్తు శక్తులను ప్రసాదిస్తాడు.

ఈ వివరణననుసరించి ఆకాశంలో యున్న వాస్తు పురుషస్వరూపుడైన సూర్య భగవానుడు భూమండలం మీద ''వాస్తుక్షేత్ర'' స్వరూపుడైన వాస్తు పురుషునికి తన బలీయము, అద్భుత శక్తిసమన్వితమైన సూర్య కిరణాలనబడే హస్తాల ద్వారా అద్భుత శక్తులను అందిస్తున్నాడు.



# వాస్తు పద విన్యాసము వైజ్ఞానిక విలువలు

భూమండలానికి సంబంధించినంత వరకు సూర్యుడే ప్రత్యక్ష దైవం. వాస్తు శాస్త్రానికి అధిదేవత వాస్తు పురుషుడు. వాస్తు పురుషుడే సూర్యుడని, సూర్యుడే వాస్తు పురుష స్వరూపుడని మన శాస్త్రాలు చెపుతున్నాయి. వాస్తు పురుష గమనం కూడా ఈ విషయాన్నే ఋజువు చేస్తుంది

మార్తాండారూఢరాశౌ వినిహితచరణ స్తన్మద న్యస్తమూర్ధా
వామేపార్శ్వే శయానో భ్రమతిసపరితః పూరుషో వాస్తురూపః
(విద్యామాధవీయం)

అనగా వాస్తు పురుషుడు సూర్య గమనాన్ననుసరించి సూర్యుడున్న రాశి యందు పాదములుంచి దానికి యేడవ రాశియందు శిరస్సు నుంచి యెడమ ప్రక్కగా శయనించినాలుగు దిక్కులయందు పరిభ్రమించునని భావము కాబట్టి ఈ వాస్తు పురుషపరిభ్రమణ విధిని బట్టి విచారించినసూర్యునకు వాస్తు పురుషునకు అవినాభావ సంబంధమున్నదని రూఢి అవుతుంది సమస్త వాస్తు శాస్త్రాలు సూర్య గమనాన్ని ప్రాతిపదికగా గ్రహించి అందలి నియమాలు వైజ్ఞానిక విలువ గలవిగా రూపొందించారు. వాస్తు శాస్త్రానికి సూర్య ప్రతినిధి యైన వాస్తు పురుషుడు అధిష్టానదేవత కాగా సూర్యకిరణాల ద్వారా మనకు లభించే సౌర శక్తిని మానవులు ఎంత పుష్కలంగా వినియోగించుకోగలరో అంత పుష్కలంగాను వినియోగించుకొనే నిమిత్తం అతీంద్రియ శక్తి సంపన్నులైన మయ, విశ్వకర్మ కశ్యపాది మహర్షులు ఒక మహిమాన్వితమైన ప్రణాళికను రూపొందించారు. ఈ ప్రణాళికయే ''వాస్తు పద విన్యాస పద్ధతి '.

సమస్త నిర్మాణ కార్యాలకు ఈ 'వాస్తు పద విన్యాస పద్ధతి' మూలాధారం. ఈ ప్రణాళికకు ప్రాతిపదిక భూభ్రమణం, భూ పరిభ్రమణం అనే భూ చలనాలు ఈ చలనాల ఆధారంగానే యేయే కాలాలలో యేయే సమయాలలో సూర్య కిరణాలు యేయే విధమైన శక్తులను విడుదల చేస్తుంటాయో ఆ

శక్తులను ఆయా నిర్మాణ క్షేత్రాలు పై నుదహరించిన వాస్తు పద విన్యాస పద్ధతి ద్వారా గ్రహించి అందు నివసించే ప్రాణులకు అందజేస్తాయని గుప్త రూపంలో మన శిల్ప ఋషులు వివరించారు. కాబట్టి ఈ ''వాస్తు విన్యాస పద్ధతి''కి సౌరశక్తికి ఏవిధమైన అవినాభావ సంబంధముందో పరిశీలిద్దాం.

కొన్ని వేల సంవత్సరాల క్రిందటిమాట. పాశ్చాత్యులకు సూర్య కిరణాలలోని రంగులను గూర్చిగాని శక్తులను గూర్చిగాని సరియగు అవగాహన లేని రోజులవి. ఈ నాటి న్యూటన్ కలర్ కార్డుగాని సోలారియం స్పెక్ట్రో స్కోపు గాని, క్వార్ట్జ్ లాంపులాంటి ఆధునిక వైజ్ఞానిక సాధనాలు లేని రోజులవి అలాంటి చరిత్రకందని అతి ప్రాచీనకాలంలో మన ప్రాచీన భారతీయ ఋషులు ఈ ప్రకృతినే ప్రయోగ శాలగా తమ తమ అతీంద్రియ శక్తులే సాధనాలుగా ఉపయోగించి ఖగోళాన్ని గూర్చి సూర్య కిరణాల స్వరూప స్వభావాలను గూర్చి బాగుగా పరిశోధించి అనేక విషయాలు సూత్ర బద్ధంచేశారు ముఖ్యంగా సూర్య కిరణాల యందలి గ్రూపులు, రంగులు ఆయా రంగుల కిరణాలు యే విధమైనశక్తులను విడుదల చేస్తాయో ఆయా శక్తుల వలనకలిగే ఫలితాలేమిటో గ్రంధస్తం చేశారు

భారతీయుల కాల పరిగణనలో సూర్యోదయం లగాయతు మరునాటి సూర్యోదయం వరకు గల కాలం ఒక అహోరాత్రము అనగా ఒక రోజు. ఒక రోజునకు 60 ఘడియలు లేక 24 గంటలు. పగలు 12 గంటలు రాత్రి 12 గంటలు. పగలు 12 గంటల కాలంలోనూ సూర్యుడు తూర్పు క్షితిజ రేఖ పై ఉదయించి క్రమ క్రమంగా ఆకాశంలో పయనించి సాయంకాలానికి పడమర క్షితిజ రేఖ పై అస్తమిస్తాడు ఈ 12 గంటల కాలంలో సూర్య కిరణాలు అన్ని వేళల్లోను ఒకే విధమైన శక్తులను విడుదల చేయవు వేరు వేరు సమయాలలో వేరు వేరు శక్తులను విడుదల చేస్తాయి అందుచేతనే పగటి కాలాన్ని అయిదు సమ భాగాలుగా విభజించారు.

సూర్యుడు తూర్పు క్షితిజ రేఖ పై ఆరు గంటలకు ఉదయించే టప్పుడు అనగా రాత్రింబవళ్ళు సమానంగా ఉన్నప్పుడు -

6 గంటల నుండి 8-24 వరకు ప్రాతః కాలము

8-24 గంటల నుండి 10-48 వరకు సంగవ కాలము

10-48 గంటల నుండి 01-12 వరకు మధ్యాహ్న కాలము

01-12 గంటల నుండి 03-36 వరకు అపరాహ్న కాలము

03-36 గంటల నుండి 06-00 వరకు సాయాహ్న కాలము

ఈ పైనుదహరించిన వేర్వేరు కాలముల యందు ప్రసరించే సూర్య కిరణాల శక్తి వేర్వేరు ఫలితాలనిస్తుందని మన పురాణాలు చెబుతున్నాయి. మన ఆధునిక వైజ్ఞానికులు కూడా ఇదే విషయాన్ని నిర్ధారించారు. ఇందులో మొదటిదయిన ప్రాతః కాలానికి ముందు అనగా సూర్యోదయాత్ పూర్వము

1. అరుణోదయ కాలము
2. ఉషః కాలము
3. బ్రాహ్మీ ముహూర్తము

అను మూడు కాలములు జరుగును. అవి ఒక్కొక్క ఘడియ కాలము మాత్రము వర్తించును. ఈ మూడు కాలములయందు వేర్వేరు శక్తులు గల కిరణాలు భూమండలం పై ప్రసరించి ప్రకృతియందలి నిద్రాణమైన శక్తులను ఉత్తేజ పరుస్తాయి.

ఉదయం 6-00 గంటలు కాగానే తూర్పు క్షితిజ రేఖపై సూర్యబింబం దర్శనమిస్తుంది. సూర్యుడు సహస్ర కిరణుడుగా క్షితిజంపైన సింహాసనాసీను డౌతాడు. ఆ సూర్య భగవానునికి ఎడమ ప్రక్కగా పర్జన్యుడు, జయంతుడు, ఇంద్రుడు అను ఉప దేవతలు, కుడిప్రక్కన సత్య, భృశ, ఆకాశ అనే దేవతలు తమ తమ సింహాసనాలను అధిష్ఠించి పరిపాలనకు బయలుదేరుతారు. అంటే సూర్యునితో కలసి మొత్తం ఏడు కిరణ సమూహములు భూమాతను తమ తమ అమృత కిరణాలతో ఆనందపరుస్తాయి. అయితే పర్జన్య, జయంత, ఇంద్ర అనే కిరణ సముదాయాలు కొంచెం తేడాతో అల్ట్రా వైలెట్ కిరణాలను ప్రసరి స్తాయి. సత్య, భృశ, ఆకాశ అనే సమూహాల కిరణాలు కొంచెం భేదంతో ఇన్‌ఫ్రా రెడ్ కిరణాలను విడుదల చేస్తాయి. ఈ రెండు రకాలైన కిరణాలు విడుదల

ద్వారా ప్రాణికోటి మనుగడకు అవసరమైన ప్రాణశక్తి పుష్కలంగా విడుదల చేయబడుతుంది. అంతేగాక అనేక విధాలైన ఔషధ శక్తులు విడుదలయగుచూ ఓషధులకు మంచి శక్తులను కలిగిస్తాయి.

ప్రాతః కాల సమయం గడచి సంగవ కాలం సమీపించేటప్పటికి ఆకాశంలో ఆ ఏడు విధముల ఆధిపత్యం సమాప్తమగును. సంగవ కాలం సమీపించేటప్పటికి సూర్యునియందలి 'అర్యమ' అనే కిరణ సమూహం ఆకాశాన్ని అధిరోహిస్తుంది. అతనికి ఎడమప్రక్క 'ఆప' అపవత్స' అనే కిరణ సమూహం కుడిప్రక్క ''సవిత్రా'' ''సవితా'' అనే కిరణ సమూహం తమ తమ శక్తులను ప్రసరింప చేస్తాయి. ఈ కిరణాలలో ఖనిజాలు లవణాలు కొన్ని రకముల విటమినులు గల శక్తులు ప్రాణులకు అందుతాయి

సంగవ కాలం పూర్తియగు సరికి మిట్టమధ్యాహ్న సూర్యుని నిట్టనిలువ కిరణాలు భూమండలాన్ని ఆవరిస్తాయి. ఈ సమయంలో ఎడమ ప్రక్క ''పృధ్వీధర'' అనే పేరుగల కిరణాలు, కుడి ప్రక్క ''వివస్వత్' అనే పేరుగల కిరణాలు పరిపాలిస్తాయి. మధ్యాహ్న కాలమంతా ఈ నిట్టనిలువ కిరణాలకు అధిపతి ఐన బ్రహ్మ పరిపాలిస్తాడు.

అపరాహ్న కాలం ప్రారంభమయ్యేటప్పటికి బ్రహ్మ స్థానంలో మైత్రాగణములనే కిరణాలు అధికారంలోనికి వస్తాయి. ఈ కిరణ సమూహానికి ''రుద్ర'' ''రుద్రదాస'' 'ఇంద్ర' ''ఇంద్రదాస ' అనే కిరణ సముదాయాలు తోడ్పడతాయి.

సాయంకాలం అయ్యేటప్పటికి వరుణుడు పడమటి క్షితిజ రేఖపై సింహాసనాన్ని అధిరోహించి పితర,దేవారిక, సుగ్రీవ, పుష్పదంత, వీరుణ అసుర, శోష, పాపయక్ష్మ అనే ఏడు విధాలైన కిరణాలతో ఆకాశాన్ని పరిసేవిస్తాయి. ప్రత్యేకమైన శక్తిని విడుదల చేయుచు భూమండలం మీది ప్రాణులకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.



# వాస్తు పద విన్యాస క్రమము

వాస్తు పద విన్యాస పద్ధతి యందు గల వైజ్ఞానిక విలువలు తెలిసి కొంటిమి. అయితే నిర్మాణ క్షేత్రమున ఆ వాస్తుపద విన్యాసము యే విధముగా చేయవలయునో తెలిసి కొందము.

వాస్తు పదములు 32 విధములుగా చెప్పబడినది. ఆయా నిర్మాణ విశేషములను బట్టి ఆయా నిర్మాణ వైశాల్యము ననుసరించి యోగ్యమైన పదమునుగ్రహించుట శిల్ప సమయము. ఇందు ముఖ్యముగా

1. చతుః షష్టిపదవాస్తు : 64 భాగములు గలది
2. ఏకాశీతి పదవాస్తు : 81 భాగములు గలది
3. శతపద వాస్తు : 100 భాగములు గలది.

ఈ మూడు విధాలైన విన్యాస పద్ధతులలోను రెండవదైన ఏకాశీతి పదవాస్తుపద్ధతి బహుళప్రచారంలో ఉంది. ఏ విధమైన నిర్మాణానికైనా ముందుగా పరిసరాలను పరిశీలించి మనసుకు నచ్చిన క్షేత్రమును దిక్సూచికి కాని లేదా ఉత్తరాకాశంలో కనిపించే ధృవ నక్షత్రాన్ననుసరించి నాలుగు దిశలను సవరించి సరిహద్దులు ఏర్పరచుకొనుట ప్రథమకర్తవ్యము. చతురస్రముగా గాని ఆయత ముగా గాని సరిహద్దులేర్పరచిన మొత్తము స్థలమునకు 'వాస్తువు' అని పేరు. అట్టి వాస్తువునకు గల ఈశాన్యపు కొయ్యను తూర్పు దిశగా ఒక అంగుళము, ఉత్తర దిశగా ఒక అంగుళము జరిపి సరిహద్దులను సవరించిన స్థలమునకు ఈశప్రాచీ అనిపేరు. ఇది మానసారములో ప్రతిపాదించబడినది.

ఆవిధంగా సవరించిన స్థలమునకు తూర్పు, దక్షిణ పశ్చిమ, ఉత్తర రేఖలను నిర్దుష్టపరచి నాలుగు మూలలయందు నాలుగు బలమైన కొయ్యలను పాతిపెట్టవలయును ఆ మధ్య స్థలమును సమతలముగా చేయవలెను.

ఆవిధముగా సమతలముచేసిన వాస్తు క్షేత్రమును 81 భాగములు గల

దానిగా విభజించినచో అది ఏకాశీతి పద వాస్తు అని పిలువబడును. అట్టి ఏకాశీతి పద వాస్తువు యొక్క బాహ్య రేఖ ప్రభావముచే వాస్తువునకు బయటగల వాస్తు దోషములు బయటనుండి లోనికి రావు. అది యొక 'లక్ష్మణ రేఖ' వంటిది.

ఏకాశీతి పద వాస్తువుయొక్క బాహ్యరేఖ నంటిపెట్టుకొని 32 భాగము లున్నవి. పంచ భూతాత్మకమైన ఆయా నిర్మాణ క్షేత్రమునకు ఈ 32 భాగములు ఆకాశతత్వమునకు చెందినవి. పై 32 గడులను ఖాళీగా విడచి లోపలి భాగంలో ఆయా నిర్మాణాలకు ప్లానులు సిద్ధంచేసుకోవాలి. అంటే బయట ప్రాకారపు గోడపై ఏ విధమైన కట్టడాలు నిర్మించరాదని దీని భావం. దీనిని మరికొందరు పిశాచ భాగమని కూడా అందురు.

## ఏకాశీతి పదవాస్తువు – ఆయతక్షేత్రము

ఈశాన్యం — తూర్పు — ఆగ్నేయం

ఉత్తరం (ఎడమ) — దక్షిణం (కుడి)

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| శిఖ | పర్జన్య | జయంత | ఇంద్ర | సూర్య | సత్య | భ్రుశ | ఆకార | వాయు |
| దితి | | | | | | | | పూష |
| అతిథి | ఆపవత్స | | | ఆర్యమ | | సవిత | | వితధ |
| సర్ప | | | | | | | | గృహక్షత |
| సోమ | పృథ్వీధర | | | బ్రహ్మ | | వివస్వాన్ | | యమ |
| భల్లాట | | | | | | | | గంధర్వ |
| ముఖ్య | | | | | | ఇంద్ర | | భృంగ |
| అహి | రుద్ర | | | మిత్ర | | | | మృగ |
| రోగ | రుద్ర | శోష | అసుర | వరుణ | పుష్పదంత | సుగ్రీవ | దౌవారిక | పితృ |

వాయవ్యం — పడమర — నైఋతి

ఏ నిర్మాణ క్షేత్రము నందయిననూ ఈ బాహ్య పదములు 32 ఖాళీగ విడిచి పెట్టవలెను బ్రహ్మ స్థానమును కూడా విడచుట నియమము. కానీ

ఆధునిక కాలమున ఈ నియమము సాధ్యపడుట లేదు. ఈ విధముగా వాస్తు క్షేత్రానికి బాహ్య పద భాగములు ఖాళీగ విడిచిన పిమ్మట మనము నిర్మింప దలచిన నిర్మాణమునకు గ్రహించిన స్థలమును నిర్దేశించి ఆ స్థలమునందు నిర్మించే నిర్మాణపు నమూనాను పై విధంగానే 81 గడులు గలదిగా ఏకాశీతి పదవిన్యాస పద్ధతికి లోబడి విభజించి ఈ క్రింది చక్రమునందలి విధముగా నాడులు సిరలు మర్మస్థానములు నిర్ధారించి ఆయా సిరా మర్మ స్థానముల యందు ఏ విధమైన వస్తువులు అనగా గుమ్మాలు, కిటికీలు, దూలాలు వగైరా నిలప రాదని గ్రహించాలి.

## ఏకాశీతి పద వాస్తువు సిరామర్మ భేదము




ఈ పై చక్రమునందలి చుక్కలు సిర. మర్మ స్థానములుగా గుర్తించవలెను. చతుష్షష్టి పద వాస్తు విన్యాసము, శత పద వాస్తు విన్యాసము పై నుదహరిం

చిన ఏకాశీతి పద విన్యాసమువలె క్షేత్రము నందు విన్యసించవలెను. సింహ ద్వార నిర్ణయమునకు కూడా ఏకాశీతి పదమునందు చూపబడిన విధంగా

తూర్పు దిశయందు ఇంద్ర జయంత పదములయందు
దక్షిణ దిశయందు గృహాక్షత, గంధర్వ పదములయందు
పడమర దిశయందు పుష్పదంత, సుగ్రీవ పదములయందు
ఉత్తర దిశయందు సోమ, భల్లాట పదములయందు
సింహ ద్వారము నిలుపవలెను.



## వర్ణాలు - వర్ణాక్షరవిన్యాసము

వర్ణాక్షర విన్యాసమును ప్రతిపాదించే ముందు ఈ వర్ణాక్షరాలు యే విధంగా ఆవిర్భవించాయి, వాటికి గల ప్రాముఖ్యత యేమిటి? అనే విషయాలు విమర్శించుకోవాలి. కొందరు ఆధునికులు ఈ వర్ణాక్షరాలు మానవులు తమ తమ భావ ప్రకటనా సౌలభ్యం కోసం కల్పించుకొన్న ధ్వని సంకేతాలు మాత్రమే అని సిద్ధాంతీకరిస్తున్నారు. కానీ, భారతీయ శాస్త్రాలు, సాంప్రదాయాలు వీరి సిద్ధాంతాన్ని అంగీకరింపవు.

భారతీయులకు వేదాలు పరమ ప్రామాణికాలు. ఆగమ శాస్త్రాలు కూడా వేద తుల్యములే. ఈనాడు సైన్సు ఎంతో అభివృద్ధి చెందింది. అయినా ఆ సైన్సు ఇంకా బాల్యావస్థలోనే ఉన్నదని కొందరి వైజ్ఞానికుల వాక్కు. ఈనాటికీ సైన్సుకు అందని ఎన్నో వైజ్ఞానిక రహస్యాలు వేదాల్లోనూ ఆగమ శాస్త్రాలలోను దాగి ఉన్నయని కొంత మంది ఆధునిక వైజ్ఞానికులు కూడా అంగీకరిస్తున్నారు.

ఉదాహరణకు : భరద్వాజ విమాన నిర్మాణ శాస్త్రంలో వర్ణింప బడిన విమాన నిర్మాణ రహస్యాలు ఆధునిక వైజ్ఞానికులకు యింకా అవగాహన కాలేదు. ప్రస్తుతం వర్ణాక్షర సమామ్నాయం యేవిధంగా ఆవిర్భవించింది? అనే విషయాన్ని పరిశీలించాలి. ఆ వర్ణాక్షర సముదాయం యొక్క ప్రాముఖ్యత ఎటువంటిదో గమనించాలి.

ప్రళయ కాలంలో ఈ జగత్తునంతా నిస్తరంగ మహాసముద్రం వంటి మహా శూన్యం వ్యాపించి ఉంది. అది ఆది మధ్యాంత రహితము. మహా చైతన్య విలసితము, ఆ మహా శూన్యం నుండి శబ్ద బ్రహ్మస్వరూపమైన 'ప్రణవం' అనే ''ఓం''కారము ఆవిర్భవించింది. ఆ ఓం కారమే ఈ సృష్టిలో ఏర్పడిన మొట్ట మొదటి ధ్వని లేక నాదం. ఆ ఓంకార నాదం సర్వ జగత్తున వ్యాపించింది. ఆ ఓంకారము నుండే కుండలినీ శక్తి ఆవిర్భవించి ప్రాణులలో ప్రవేశించింది. ఆ కుండలినీ శక్తియే ఆది పరాశక్తియగు జగన్మాత. మానవ దేహములో ఏబది యొక్క శక్తి పీఠాలున్నాయని శాస్త్రాలు చెబుతున్నాయి. '' ఓం''కార రూపిణి యగు కుండలినీ శక్తి మానవ దేహంలో గల 51 శక్తి పీఠాల నుండి ప్రథమ

స్థానంలో తానుండి మిగిలిన ఏబది శక్తి పీఠాల నుండి ఏబది అక్షరాలు ఆవిర్భవింపజేసింది. ఆ యేబదీ అక్షరాల వర్ణసమామ్నాయమే శారదాంబా స్వరూపముగా, నాద రూపిణియై మానవ దేహంలో ఆపాదమస్తక పర్యంతంగల శక్తి పీఠాలలో సూక్ష్మ రూపంలో సంచరిస్తూ ముఖ మార్గాన ఓష్ఠ్య, దంత్య, తాలవ్యాది స్థానముల గుండా విశిష్ట ధ్వనుల రూపంలో మాతృకావర్గం అనబడే అ కారాది క్ష కారపర్యంతం గల అక్షర సమామ్నాయం బహిర్గతమై లోకమున వ్యాపించినది.

ఈ శారదాంబా స్వరూపమైన వివిధ వర్గాక్షరాలు విభిన్న రూపాల కలయికతో గురు లఘు రూపాత్మక ప్రస్తార క్రమాన్ననుసరించి ఛందస్సు పుట్టింది. ఆ ఛందోబద్ధమగు అక్షర విన్యాసంతో శారదాంబ అలంకరింపబడి సాహిత్య జిజ్ఞాసువుల చేత ఆరాధింపబడుచున్నది. అందుచేతనే

అ క,చ,ట,త ప, యాద్యైరష్టభిర్వర్ణవర్గైః
విరచితముఖ బాహోః పాదమధ్యాఖ్య హృత్కా
సకల జగదధీశా శాశ్వతావిశ్వయోని
ర్వితరతుపరిశుద్ధిం చేతసః శారదావః (మాతృకా రహస్యం82)

పై శాస్త్ర వచనము ననుసరించి అ క,చ,ట త పాది అష్ట వర్గాక్షరములకు అధి దేవత ఆ ఆదిపరాశక్తియని మంత్ర శాస్త్రం వక్కాణిస్తుంది. మాతృకలనగా అకారాది క్షకార పర్యంతము గల ఏబది అక్షరాల సమూహమేనని అవగతమైనది గదా అయితే ఈ వర్గాక్షరాలకు వాస్తుకు ఏమిటి సంబంధం? అని విమర్శించుకోవాలి అతీంద్రియ జ్ఞాన సిద్ధులైన మన ప్రాచీన ఋషులు ఈ సమన్వయాన్ని పరిశోధించి సాధించారు. గమనించండి

గణేశ గ్రహనక్షత్ర యోగినీ రాశి రూపిణీం
దేవీం మంత్ర మయీం, నౌమి మాతృకాపీఠ రూపిణీం

అను సూత్రముననుసరించి శారదామాత గణేశ, గ్రహ, తారకా రాశి రూపిణియై జ్యోతిశ్చక్రము నాశ్రయించి కాలచక్ర పరిభ్రమణమును కొనసాగించుచు జ్యోతిష శాస్త్రానికి ఆధార భూతమై నిలచినది. పై శ్లోకమున మాతృకా పీఠమనగా అకారాది క్షకార పర్యంతముగల అక్షర సమామ్నాయమని తెలియవలెను

## వర్గాక్షరాలు వాస్తు, జ్యోతిష శాస్త్రాలలో వాటి ప్రాముఖ్యత

అకారాది క్షకార పర్యంతముగల వర్గాక్షరాలు ఏబది. ఆ ఏబది అక్ష రాలు ఎనిమిది వర్గులుగా విభజింపబడినవి. ఆ యెనిమిది వర్గులలోని అక్షరా లను వాటి శక్తి స్వభావాలనుగుర్తించిన మన ఋషులు అ క చ ట,త,ప య,శ అను వర్గులను ఈక్రింది విధంగా జ్యోతిశ్శాస్త్ర పరంగా అన్వయించారు.

| వర్గులు | దిశలు | అధిదేవత | గ్రహం | సిద్ధులు | రాశులు |
|---|---|---|---|---|---|
| అ | తూర్పు | వశినీ | రవి | మహాలక్షి | మేష, వృశ్చిక |
| క | ఆగ్నేయ | కామేశ్వరి | కుజుడు | బ్రహ్మ | తుల |
| చ | దక్షిణ | మోదిని | శుక్ర | మహేశ్వరి | వృశ్చిక |
| ట | నైఋతి | విమలా | బుధ | కౌమారి | ధనుస్సు |
| త | పడమర | అరుణా | గురుడు | వైష్ణవి | మకరం |
| ప | వాయువ్యం | జయినీ | శని | వారాహి | కుంభం |
| య | ఉత్తరం | సర్వేశ్వరి | చంద్రుడు | ఇంద్రాణి | మీనం |
| శ | ఈశాన్యం | కౌలిని | చంద్రుడు | చాముండీ | మీనం |

పైన చూపిన చక్రోద్ధారమునందు వర్గులకు, రాశులకు గల సంబంధం కేవలంవాస్తు శాస్త్రానికి మాత్రమే పరిమితమైనది. మంత్రశాస్త్రములో వర్గులకు, రాశులకు మధ్య సంబంధం దీనికి భిన్నముగా ఉంటుంది. ఇక్కడ మనం వాస్తు శాస్త్రానికి సంబంధించినంత వరకు మాత్రము గ్రహించవలెను

విజ్ఞానశాస్త్రంలో ఎంతో అభివృద్ధిని సాధించినవి అని అనుకొంటున్న విదేశాలలో కూడా ఈ అక్షర విజ్ఞానం మిక్కిలి అభివృద్ధి పొందింది సంఖ్యా శాస్త్రం అంతా ఈ అక్షర విజ్ఞానం మీదనే ఆధారపడినది ఒక్కో అక్షరం పైన ఒకో సంఖ్య అధికారం కలిగి ఉంది. అమెరికాలో నామ ప్రథమాక్షరమునకు గల ప్రభావం మీద సుప్రసిద్ధమనో వైజ్ఞానికులు డా. ఫేవర్, డా. సవాలీన్‌వెస్టన్ అనే పరిశోధకులు విశేషంగా పరిశోధించి 'శబ్దం అనంత శక్తియుతం అని ఋజువు పరచారు. వారి పరిశోధనలు ఆధారంగా మనుష్యుల యొక్క పేర్ల యందలి మొదటి అక్షరం ఎంతో ప్రాముఖ్యత కలిగియుంటుందని నిర్ణయించారు. వారి

సిద్ధాంతాల ననుసరించి A నుండి R అను 18 అక్షరములు పేర్లకు మొదటి అక్షరముగా గలవారు మిక్కిలి అదృష్ట జాతకులగుచున్నారని నిర్ణయింపబడి నది. భారతీయ జ్యోతిశ్శాస్త్రంలో కూడా నామ ప్రథమాక్షరానికి మిక్కిలి ప్రాముఖ్య మీయబడినది మనుష్యుల యొక్క పేర్లయందు మొదట గల అక్షరముల ననుసరించి నామ నక్షత్ర పరిజ్ఞానము వివరింప బడినది వాస్తు శాస్త్రంలో వర్గారూఢము రూపుదిద్దుక్కొంది జ్యోతిశ్శాస్త్రంలో ఈ వర్గా రూఢ పద్ధతి ఆసేతు హిమాచల పర్యంతం అమలులో ఉంది పరంపరా గతమైన ఈ సిద్ధాంతము మాతృకా స్వరూపిణియగు శారదాంబా వరప్రసాద మేనని భారతీయుల విశ్వాసము. వర్గార్యూఢము ననుసరించి ఆయా దిక్కుల యందు వర్గ విన్యాసము ఈ క్రింది విధముగానున్నది

ఈశాన్యం — తూర్పు — ఆగ్నేయ

| | | |
|---|---|---|
| శ<br>కుందేలు | అ<br>గ్రద్ద | క<br>పిల్లి |
| య<br>ఏనుగు | బ్రహ్మ<br>స్థానము | చ<br>సింహం |
| ప<br>ఎలుక | త<br>సర్పము | ట<br>కుక్క |

ఉత్తరం (ఎడమ) — దక్షిణం (కుడి)

వాయువ్యం — పడమర — నైఋతి

## వర్గాక్షర విజ్ఞానము

1. అ వర్గు అ, ఆ ఇ ఈ ఉ ఊ, ఋ, ౠ ఎ ఏ, ఐ, ఒ ఓ, ఔ, అం అః.
2. క వర్గు -- క ఖ, గ, ఘ
3. చ వర్గుచ ఛ, జ, ఝ ఞ
4. ట వర్గు ట, ఠ డ, ఢ, ణ
5. త వర్గుత థ, ద ధ, న
6. ప వర్గు ప, ఫ, బ, భ, మ
7. య వర్గు య ర, ల, వ
8. శ వర్గు శ, ష, స, హ, క్ష

పై వర్గాక్షరములు మొత్తము 50 అక్షరములు వరుసగా ప్రాగాది ఎని మిది దిక్కులయందు న్యాసము చేయబడినవి. 'స్వవర్గాత్ పంచమో రిపుః' అనే సూత్ర ప్రకారం స్వస్థానానికి అయిదవ స్థానము శత్రు స్థానమగుచున్నది. సమస్త నిర్మాణ కార్యముల యందు శత్రు స్థానమును విడువవలెను. వర్గా రూఢము ననుసరించి ముఖద్వార నిర్ణయము అనుకూలింపనపుడు మాత్రము రాశ్యానుకూలమగు ముఖ ద్వారమును నిర్ణయించుట శిల్ప సమయము

# వర్గారూఢము

వెనుకటి ప్రకరణంలో వర్ణాక్షరాల ప్రాముఖ్యత, వర్గారూఢం అనగా ఏమిటి అనే విషయాలు గ్రహించాం. ప్రస్తుతం వర్గారూఢాన్ని అనుసరించి గృహ నిర్మాణం ఏ విధంగా చేయాలి అనే విషయం పరిశీలిద్దాం. గృహ యజమాని పేరునందలి మొదటి అక్షరం ఏవర్గునకు చెందినదో నిర్ణయించి ఆ వర్గునకు తగినవిధంగా ముఖద్వారము ఉండేలా గృహానికి రూపకల్పన చేయాలి.

అ క,చాః పశ్చిమే ద్వారే టవర్గః పశ్చిమోత్తరే
ధనదే త,ప వర్గౌచ,య,శౌ పూర్వేతు దక్షిణే।

అనే శాస్త్ర ప్రమాణము ననుసరించి ఈ క్రింది పట్టిక ప్రకారం ముఖద్వార నిర్ణయం చేయాలి.

| | | |
|---|---|---|
| అ,క,చ | వర్గులవారికి | పశ్చిమ ముఖద్వారము శ్రేష్టము. |
| ట, | వర్గువారికి | పశ్చిమ , ఉత్తర ముఖద్వారము శ్రేష్టము |
| త,ప | వర్గులవారికి | ఉత్తర ముఖద్వారము శ్రేష్టము. |
| య,శ | వర్గులవారికి | తూర్పు, దక్షిణ ముఖద్వారము శ్రేష్టము. |

గమనిక : గృహ యజమానుని పేరునందు అయిదారు పేర్లు కలసి ఉన్నచో వాడుకలోనున్న పేరునందలి మొదటి అక్షరమునుబట్టి కూడా వర్గారూఢమును నామ నక్షత్ర నిర్ణయమును చేయు ఆచారము కొన్ని ప్రాంతముల యందున్నది.

గృహ నిర్మాణ కర్త వర్గుననుసరించి ఎంచుకున్న స్థలమునందు ముఖ ద్వారము పెట్టి ఇంటిని నిర్మించుటకు వీలు పడనపుడు కర్త నామ రాశి రీత్యా ఈ క్రింది పట్టికననుసరించి ముఖ ద్వారము నిర్ణయించుకొను పద్ధతి శాస్త్ర సమ్మతము

| ముఖద్వారము | ఏయే రాశులవారికి, ఏయే వర్గులవారికి శ్రేష్టము |
|---|---|
| 1. తూర్పు ద్వారము | మేష, కర్కాటక, సింహ వృశ్చిక, ధను మీనము య శ వర్గులవారికి శ్రేష్టము |
| 2. దక్షిణ ద్వారము | వృషభం, మిధునం, కర్కాటకం కన్య, మకర రాశుల వారికియ శ వర్గులవారికి శ్రేష్టము |
| 3. పశ్చిమ ద్వారము | వృష, మిధు, తుల ధను, కుంభ రాశులవారికి అ,క,చ,ట వర్గులవారికి శ్రేష్టము |
| 4. ఉత్తర ద్వారము | మేష, వృష, కర్కా, సింహ, వృశ్చి, కుంభ ధను మీన రాశులవారికి ట త ప వర్గులవారికి శ్రేష్టం |

గమనిక : వర్గారూఢము ననుసరించిగాని రాశిరీత్యాగాని యోగ్య మగు ముఖద్వారము వీలు పడనియెడల స్థలానికి అనువైనంత మాత్రాన గృహ నిర్మాణం చేయరాదు.

## ముఖద్వార నిర్ణయమునగల కొన్ని మెలకువలు

**1. తూర్పుముఖద్వారము :** అ వర్గువారికి తూర్పు ముఖద్వారము గల పడమటిల్లు నిషేధము. ఐనను అ అక్షరము మేషరాశికి చెందినది కాబట్టి అ వర్గునందలి అ అక్షరము తమ పేరునందలి మొదటి అక్షరముగా గలవారు మాత్రము తూర్పు ముఖద్వారమును మధ్యమ పక్షముగ స్వీకరింపవచ్చును. అట్లే త వర్గువారికి తూర్పు ముఖద్వారము చెప్పబడలేదు. ఐనను త అను అక్షరము పేరులో మొదటి అక్షరముగా గలవారికి పడమర స్వస్థానవ ం కాబట్టి తూర్పు ముఖద్వారముగల పడమటిల్లు నిర్మించుకొనవచ్చును అట్లేద, న అనే అక్షరాలు గలవారి రాశి రీత్యా తూర్పు ముఖద్వారము అర్హణమే

**2. దక్షిణముఖద్వారము :** చ వర్గువారికి దక్షిణ ముఖద్వారముగల ఉత్తరపు ఇల్లు నిషేధము అయినప్పటికి చ వర్గునందలి జ అనే అక్షరం మకర రాశికి

చెందినది కాబట్టి రాశి రీత్యా జ కారము నామ ప్రథమాక్షరముగా గలవారు దక్షిణ ముఖద్వారము గల ఉత్తరపు ఇల్లు నిర్మించుకొనవచ్చును. చ నామ ప్రథమాక్షర ముగా గలవారుమాత్రము దక్షిణ ముఖద్వారము గల ఉత్తరపు ఇల్లు నిర్మింప కూడదు.

**3. పశ్చిమ ముఖ ద్వారము :** త వర్గువారికి పశ్చిమ ముఖద్వారము నిషిద్ధము. అయినను త,ద అను అక్షరాలు తులా, ధనూరాశులకు చెందినవి కాబట్టి త,ద అను అక్షరములు నామ ప్రథమాక్షరముగా గలవారు పశ్చిమ ముఖద్వారముగల ఇల్లు నిర్మించుకొనవచ్చును. కాని'న' నామ ప్రథమాక్షర ముగా గలవారు పడమర ముఖద్వారముగా గల తూర్పు ఇల్లు నిర్మింపరాదు.

**4. ఉత్తర ముఖద్వారము:** య వర్గు వారికి ఉత్తరసింహద్వారము నిషేధము కాని 'య' వృశ్చిక ధనూ రాశులకు 'ల' మేషరాశికి 'వ' వృషభరాశికి చెందినది. కావున య.ల.వ అను అక్షరాలు నామ ప్రథమాక్షరాలుగా కలవారు మధ్యమ పక్షముగా ఉత్తర సింహ ద్వారముగల దక్షిణపు ఇల్లు నిర్మింపవచ్చు కాని 'ర' నామ ప్రథమాక్షరముగా గలవారు ఎంత మాత్రము ఉత్తర సింహద్వారము గల ఇల్లు నిర్మింపరాదు.

గమనిక. వర్గారూఢము సర్వశ్రేష్టమైనది. వర్గారూఢము వీలుపడనపుడు మాత్రమే రాశ్యాను కూలమగు ముఖ ద్వారమును నిర్ణయింపవలెను.



## క్షేత్రమునందలి దిశలు-వాటిభాగస్వామ్యము

దిక్కులు నాలుగు విదిక్కులు నాలుగు మొత్తం ఎనిమిది దిక్కులు ఈ దిక్కులతో పృధివి, ఆకాశం కలిసి దశ దిశలనికూడా వ్యవహరిస్తుంటాం. 1. తూర్పు, 2. ఆగ్నేయము, 3. దక్షిణము, 4. నైఋతి, 5. పడమర 6. వాయువ్యం, 7. ఉత్తరం, 8. ఈశాన్యం అనునవి వరుసగ ఎనిమిది దిక్కులు ఈ ఎనిమిది దిక్కులలోను తూర్పు, దక్షిణం పడమర, ఉత్తరం ప్రధానమైన దిక్కులు, ఆగ్నేయం నైఋతి, వాయువ్యం, ఈశాన్యం అనే నాలుగు కోణ దిశలు ఈ ఎనిమిది దిశా భాగములకు ఆధిపత్యం వహించి పరిపాలించే దిక్పతులు ఉన్నారు.

| దిశ | అధిపతి |
|---|---|
| తూర్పుదిశ | ఇంద్రుడు |
| ఆగ్నేయదిశ | అగ్ని |
| దక్షిణదిశ | యముడు |
| నైఋతిదిశ | నైఋతి |
| పశ్చిమదిశ | వరుణుడు |
| వాయువ్యదిశ | వాయువు |
| ఉత్తరదిశ | కుభేరుడు |
| ఈశాన్యదిశ | రుద్రుడు |

ఈ పైనుదహరించిన వరుస ప్రకారం ఆయా దిశలకు అధిపతులైన దేవతలు వారి యొక్క స్వభావాలకు అనుగుణంగా ఫలితాలనిస్తారని శాస్త్రకర్త లైన ఋషుల అభిప్రాయం. నిర్మాణ క్షేత్రమునందు ఏయే దిశలకు ఎంతెంత భాగస్వామ్యము గలదో గ్రహించుట ముఖ్యాంశము. ఈ విషయాన్ని గూర్చి ద్విశాలా నిర్మాణ ప్రకరణంలో అపరాజిత పృచ్ఛ అనే గ్రంథంలో నిర్ధారింప బడింది.

చతురస్రం సమంకృత్వా, త్రిపుటే నవకోష్టకం
మధ్యకోష్టః పదం త్యక్త్వా శాలాయుగ్మే ప్రతిష్టితా

పై ప్రమాణము ననుసరించి క్షేత్రమును (ఆయతముగాని చతురస్ర ముగాని) తొమ్మిది సమభాగములుగ విభజించి మధ్య పదమును బ్రహ్మ పద ముగ విడువవలెను మిగిలిన ఎనిమిది భాగములు వరుసగ ప్రాగాదిగ ఎనిమిది దిక్కులుగ గుర్తించవలెను. ఈ క్రింది విభజనను గమనింపుడు

| | | |
|---|---|---|
| ఈశాన్యం | తూర్పు | ఆగ్నేయం |
| ఉత్తరం | బ్రహ్మస్థానం | దక్షిణం |
| వాయువ్యం | పడమర | నైఋతి |

పై విభజన ననుసరించి ఆ క్షేత్రభాగములందు ఆయా దిశా భాగస్వా మ్యము కలుగును. ఆయా దిశా భాగములందు ఆయా దిక్పతులు ఆధిప త్యము కలిగి యుందురు. అందు విదిక్కులకు లభించిన భాగములకు ఈ క్రింది వివరణమును పరిశీలింపుడు.

## ఈశాన్యము :

ఈశాన్యదిశకు లభించిన భాగమునకు తూర్పునగలభాగము, తూర్పు ఈశాన్యముగాను, ఉత్తరమునగల భాగము ఉత్తర ఈశాన్యముగాను పిలుచుట అనూచానముగా వస్తున్న ఆచారము. దీనినే శిల్ప సమయమని కూడా అందురు. ఈ రెండు దిశలు పెరిగి యుండుట శుభ ప్రదవుని శాస్త్రకారుల అభిప్రాయము.

## ఆగ్నేయము :

ఆగ్నేయమునకు చెందిన భాగమునకు తూర్పునగల స్థలమును తూర్పు ఆగ్నేయమని, దక్షిణమునగల స్థలమునకు దక్షిణాగ్నేయమనియు వ్యవహరింతురు

ఆగ్నేయ ప్రాచిసంయుక్తం సర్వదోషకరంభవేత్
ఆగ్నేయ ప్రాచికంవాస్తు తస్మాత్ సర్వంవిసర్జయేత్

మానసారం-పే 17

అని మానసార మహర్షి చెప్పియున్నాడు కాబట్టి ఆగ్నేయం పెరిగిన స్థలమునందు పెరుగుదలను విడిచి పెట్టవలెను.

## నైఋతి :

నైఋతి దిశాభాగము నందలి దక్షిణ దిశయందలి స్థలము దక్షిణనైఋతి యనియు, పశ్చిమ దిశయందుగల స్థలమును పశ్చిమనైఋతి అనియు వ్యవహరింతురు. ఈనైఋతి దిశకు దక్షిణ పడమరలయందు పెరిగినస్థలము వంశ నాశనమును కలిగించును. కాబట్టి ఈ దిశలయందలి పెరుగుదలను ఖండించి తప్పనిసరిగా మూలమట్టమునకు సరిచేసి దిక్కులు సవరించుకొనవలెను అట్లు చేయనియెడల దిశాధి పతియైన నైఋతి రాక్షస స్వభావము అశుభములను కలిగించును

## వాయువ్యము :

వాయువ్య దిశాభాగమునకు పడమర దిశయందున్న స్థలము పడమర వాయువ్యము ఉత్తర దిశయందున్న పెరుగుదలకు ఉత్తరవాయువ్యమని వ్యవహరింపబడుచున్నది ఈ పెరుగుదలలు కూడమేలును కలుగజేయవు వాయువ్య దిక్పతి బలము పెరిగి గృహము నందు అంతః కలహములు భార్యా భర్తలకు వైరములు, పిల్లల పోట్లాటకు అందు నివసించు స్త్రీలకు అరిష్టములు కలుగును. వాయువ్యం పెరుగుటచేత ఉత్తర ఈశాన్యములు లోపించి దిక్పతులు బలహీన పడుదురు అందుచేత శుభ ప్రదము కాదు. ''దిగ్భ్రామధే కులనాశస్యాత్ వక్రేదారిద్ర్యమాదిశేత్' అనగా ఏ దిశలూ లోపముకారాదు. ఏ దిశ యొక్క సరిహద్దు రేఖ వంకరగా యుండరాదని శాస్త్రవచనము.

కాబట్టి గృహ నిర్మాణ క్షేత్రము యొక్క నాలుగు దిశలను మొదట దిక్సూచీకి సవరించి ఆ పిమ్మట ఉత్తర ఈశాన్యము ఒక అంగుళము తూర్పు ఈశాన్యము ఒక అంగుళము పెంచి ఈశప్రాచీ అను స్థలమును రూపొందింపవలయును ఈ క్రింది వాక్యమును గమనింపుడు

తద్వశాత్ కకుభంగ్రాహ్యం తత్ర సూత్రం ప్రసారయేత్
శుద్ధప్రాచీ భవేత్ సౌమ్యగైశాన్యప్రాచ్యధోచ్యతే

ప్రాచ్యాంగుళ కృతాద్విందో ఉత్తరేచాంగుళంన్యశేత్
ప్రతీచీ మాత్రతద్విందోః ఈశప్రాచీం ప్రసూత్రయేత్

కాబట్టి విజ్ఞులు గృహ నిర్మాణ స్థలాన్ని ఒక్క ఈశాన్య భాగమున తప్ప యే దిశయందు పెరుగుట గాని లోపము గాని లేకుండా స్థలమును సవరించు కొని ఆయా దిశా భాగములను వాటి అధిపతులను శుభాశుభ ఫలితములను అవగాహనచేసుకొని నిర్మాణకార్యక్రమమును ప్రారంభింపవలెను. ఈ నియమము స్థలమునకు తప్ప నిర్మాణ గృహమునకు వర్తించదు.

గమనిక: ఇక్కడ ఒక ముఖ్యవిషయాన్ని గమనించాలి. యేవిధమైన శాస్త్ర ప్రమాణానికైనా రెండు విధులుంటాయి. ఇందు మొదటిది సామాన్య విధి. అనగా అన్ని చోట్లా సమాన స్థాయిలో అమలుపరచ తగినది. రెండవది విశేషవిధి ఈ సామాన్య విధిని అమలుపరచడం సాధ్యం కానప్పుడు ఈ విశేష విధులను అనుసరించాలి. ఈ విశేషవిధి దేశ కాల పాత్రతలకు అనుగుణంగా శాస్త్ర వచనానికి విఘాతం లేకుండా కొంచెం వెసులుబాటు కల్పిస్తుంది. దిశా భాగ స్వామ్యాన్ననుసరించి బ్రహ్మ పదాన్ని విడిచి పెట్టి వర్గారాధ పద్ధతిని అనుసరించి, శత్రు మిత్ర క్షేత్ర విమర్శ చేసికొని శత్రు వర్గ భాగ దిశను విడచి నగర గ్రామ, గృహాది నిర్మాణములు చేపట్టాలి. అయితే నగర, గ్రామాది నిర్మాణా లలో ఈ సూత్రం ఆచరణ సాధ్యమే. కానీ సామాన్య గృహ నిర్మాణంలో ఈ విధానం ఆచరణ సాధ్యం కాదు. ఆధునిక కాలంలో క్రిక్కిరిసి పోవుచున్న జనారణ్యంలాంటి నగరాలలో ఈ బ్రహ్మ పదం విడిచి పెట్టి గృహ నిర్మాణం చేయడం అసాధ్యంగానే యున్నది. కాబట్టి ఈ పరిస్థితులలో ''విశేషవిధి'' ని ఆశ్రయించి దేశకాల పాత్రతలకు తగిన నిర్మాణశైలితో గృహ నిర్మాణం చేయాలి.

ఉదాహరణకు: కలకత్తా, హైదరాబాదువంటి మహానగరాలలో ఒక వ్యక్తి 40 x 30 చతురపుటడుగుల స్థలంలో నవభాగ క్రమంలో మధ్యగల బ్రహ్మపదం విడచి చుట్టును గల వాస్తు పద విన్యాసం ప్రకారం బాహ్య దేవతా పదాలను విడచి పెట్టి మిగిలిన స్థలంలో గృహ నిర్మాణం సాధ్యమా? కాబట్టి ఇక్కడ విశేషవిధిని ఆశ్రయించాలి. అనుభవజ్ఞులైన స్థపతులు పై విషయములు చక్కగా గ్రహించి గృహ నిర్మాణాదులను చేపట్ట గలరు.



# దిశలు - సూర్యకిరణాల ప్రభావం

దిక్కులకు శక్తులు యేవిధంగా లభిస్తున్నాయి? అనే విషయం మన ప్రాచీన గ్రంధాల ఆధారంగా దిగధిపతులైన దిక్పతుల ప్రభావం చేత అని సమాధాన పరుస్తాం. కాని ఆధునిక వైజ్ఞానిక దృక్పధంలో కూడా పరిశీలించి ఆయా దిశలకు లభ్యమయ్యే ప్రాకృతిక శక్తి యెట్టిదో విచారించ వచ్చును వాస్తు శాస్త్ర మంతా సూర్యగమనం ఆయా సమయాల్లో భూగోళం మీద ప్రసరించే సూర్య కిరణాల ప్రభావం'' అనే విషయాల ఆధారంగా రూపొందించబడింది. దిశల బలాబలాలను గురించి కూడా ఆయా కాలములయందు ప్రసరించే సూర్య కిరణ ప్రసారం వాటి ప్రాకృతిక శక్తుల ఆధారంగా ఆయా దిశలు శక్తివంతం అవుతాయి. ఆయా దిశలకు సూర్యకిరణ ప్రసారం చేతనే ప్రత్యేక శక్తులు సంక్రమిస్తాయి. పై విషయాన్నీ వాస్తు శాస్త్ర గ్రంథాలలో రూపొందింప బడిన వాస్తుపద విన్యాసం అనే ప్రకరణం విశదీకరిస్తుంది. 9వ ప్రకరణంలో చెప్పబడిన విషయాలే ఈ ప్రకరణంలో విపులంగా చర్చించ వలసి ఉంది. పాఠకులు పునరుక్తిగా భావింపరాదు.

ఈ భూగోళం పడమర నుండి తూర్పు దిశగా ఆత్మభ్రమణం చేస్తూ ఉంటుందని ఇదివరలో చదివాం ఆ భూ భ్రమణ సిద్ధాంతం ప్రాతిపదికగా ఏయే సమయాలలో ఏయే దిశలను ఏయే సూర్య కిరణాలు ప్రభావితం చేస్తాయో నిర్ధారించబడింది వరుసగా ప్రాతఃకాలము, సంగవకాలము మధ్యాహ్న కాలం, అపరాహ్న కాలం, సాయాహ్న కాలం అని ఐదు కాలములుగా పగటికాలము విభజింపబడినది. ఈ ఐదు కాలముల యందు సూర్యకిరణాలు విడుదల చేసే ప్రాకృతిక శక్తులు ఒకే విధంగా ఉండవు

''అపరాజిత పృచ్ఛ'' అనే ప్రాచీన వాస్తుగ్రంధాన్ననుసరించి

**1. ప్రాతఃకాలము:** ప్రాతఃకాలమున సూర్య కిరణాలు విడుదల చేసే శక్తులకు సూర్యుడు అధిదేవత అధిదేవత అనగా ఆయా కిరణాలు విడుదల చేసే సౌరశక్తుల స్వభావాలకు గుణాలకు, ఫలితాలకు ప్రతీక మాత్రమే

**2. సాయంకాలము:** సూర్యకిరణాలు విడుదలచేసే శక్తులకు వరుణుడు అధిదేవత ప్రాతఃకాలము, సాయంకాలముల యందు సూర్యకిరణాలు విడు దల చేసే ప్రాకృతిక శక్తులు వేర్వేరు ఫలితాలనిస్తాయి. ఈ వైజ్ఞానిక విలువలను విజ్ఞులు పరిశీలించి తెలుసుకోగలరు. గమనింపుడు--

**ఈశాన్యదిశ:**

వాస్తు శాస్త్రంలో ఈశాన్యమునకు గల ప్రాముఖ్యం గమనించదగినది. ఈశాన్యమునకు అధిపతి ఈశానుడు అనే రుద్రుడు. ప్రాతఃకాలములో విడుద లయ్యే సూర్యకిరణ సమూహంలో గల అల్ట్రావయొలెట్' కిరణపుంజాలకు అధిదేవత. ఈ అల్ట్రావయొలెట్' కిరణాలు పదిహేనుగుంపులు. ఆయాగుంపులు విడుదల చేసే శక్తుల ఆధారంగా మన మహర్షులు ఆయా కిరణాలకు ఈక్రింది పేర్లు పెట్టారు.

| | | |
|---|---|---|
| 1. నీలకంఠ | 6. అతీంద్రియ | 11. జ్వలత్రిశూల |
| 2. త్రినయన | 7. సూక్ష్మ | 12. గండమాల |
| 3. సహస్రాక్ష | 8. అనంత | 13. నాగేంద్రహార |
| 4. వజ్రదంష్ట్ర | 9. శశిశేఖర | 14. నాగేంద్రవలయ |
| 5. అత్యుగ్ర | 10. గంగాధర | 15. శంకర |

ఈ 15 గుంపుల కిరణాలు తమ తమ పేర్లకు తగిన ఫలితాలనిచ్చే సౌరశక్తిని విడుదల చేస్తాయి. సూర్యబింబం తూర్పు దిక్కున క్షితిజరేఖ మీద ప్రత్యక్షమయ్యే ప్రాతఃకాలం నుండి సంగవకాలం ప్రారంభమయ్యే వరకు ఈ 15 గుంపుల సౌరశక్తులు ఈశాన్యదిశాభాగాన్ని ప్రభావితం చేస్తాయి. మనం ఎంచు కొన్న నిర్మాణ క్షేత్రంలో బాహ్య రేఖకు లోపల చుట్టూ గల 32 పదముల కాళీస్థలం అనగా తొమ్మిదవ భాగం (పిశాచభాగం) విడచి మధ్య భాగంలో గృహ నిర్మాణం చేస్తాం. ఆ విధంగా నిర్మించిన ఇంటికి ప్రాగాది ఎనిమిది దిక్కులు ఏర్పడతాయి. ఈ భూగోళం పడమర నుండి తూర్పు దిశగా ఆత్మభ్రమణం

చేస్తుంది. ఆ కారణం చేత మన నిర్మాణ క్షేత్రం కూడా భూమితో పాటు తూర్పు దిశగా కదులుతుంది. ఆ కారణంచేత తూర్పు క్షితిజరేఖ మీద సూర్యబింబం ఉదయించగానే మొట్టమొదటి సూర్యకిరణం మన నిర్మాణ క్షేత్రానికి ఈశాన్య దిశను తాకుతుంది ఆ విధంగా ఈశాన్యదిశ ప్రాతఃకాల సూర్యకిరణ సమూహాలచేత ప్రభావితమై మహాశక్తి సంపన్న మగును ఉదయకాల సూర్యకిరణాలయందలి అల్ట్రావైలెట్' కిరణ శక్తులు వివిధ రకాలైన ఔషధ రసాయనిక శక్తులను ఈశాన్యదిశ యందు నిండియున్న గాలిలోను నీటిలోను నింపి ఆ భాగాన్ని శక్తివంతంగా చేస్తాయి.

రెండవదైన సంగవ కాలం ప్రారంభం కాగానే క్రమ క్రమంగా సూర్య బింబం ఆకాశంలో పైకి లేచే కొద్దీ సూర్యకిరణాలలోని పర్జన్య, జయంత యింద్ర అనే కిరణ సమూహాలు వెనుకటి అల్ట్రావైలెట్ కిరణాలకు చేయూత నిస్తూ మానవ జీవితానికి అత్యవసరమైన ప్రాణశక్తిని (ఆక్సిజన్) ఈశాన్య తూర్పు భాగాలయందున్న గాలిలోని అణు సముదాయానికి పుష్కలంగా అందిస్తాయి. ఆ ప్రాణవాయువు నెమ్మదిగా గృహాభిముఖమై ఆ గృహమున నివసించే ప్రాణులకు అందిస్తుంది ఆ విధంగా తూర్పు ఈశాన్యదిశలు గృహస్తులకు ప్రాణప్రదమైనవి. తూర్పు దిశాధిపతి ఇంద్రుడు. దేవతలకు రాజు సమస్త శుభముల సంపదల నిచ్చే దైవము సంగవ కాలంలో సూర్యుని నుండి వెలువడే పర్జన్య ఇంద్ర, జయంత అనే మూడు సమూహాల కిరణాలు ఇంద్ర సంబంధమైనవి. కాబట్టి తూర్పు దిశ పై కిరణాల చేత మిక్కిలిగా బలపడి గృహస్తులకు అష్టైశ్వర్యములు చేకూరుస్తుంది. అందుచేతనే ప్రతి గృహానికి యింద్రస్థానమైన తూర్పుదిశ తగినంత వైశాల్యం కలిగి ఉండాలి అందుచేతనే తూర్పు ఈశాన్యములయందు ఎత్తుగా పెరిగిన సూర్యకిరణ ప్రసారాన్ని అడ్డగించే చెట్లను పెంచడం కట్టడాలను నిర్మించడం చేయకూడదని వాస్తు శాస్త్రం చెబుతుంది. అంతేగాక ఈశాన్య తూర్పు దిశలు గృహాన్ని బట్టి తగినంత వైశాల్యం కలిగి ఉండకపోతే ఆ గృహస్తులు మానసిక అశాంతితోను రోగగ్రస్తులై దరిద్ర దశను అనుభవిస్తూ దుఃఖాలపాలవుతారని శాస్త్రం వివరిస్తుంది

మరో ముఖ్య విషయంయేమనగా ఈశాన్య, తూర్పు దిశలయందు నూయి ఎందుకు తీయాలి? నీటిలో విద్యుచ్ఛక్తిని గ్రహించే శక్తి అధికంగా ఉంది ప్రాతఃకాల సూర్యకిరణాలు విడుదల చేసే సౌర శక్తియందలి విద్యుచ్ఛక్తి నూతి యందలి నీరు తన లోనికి పీల్చుకొని నిలువ చేసి గృహస్తులకు ఇస్తుంది. అంతే గాక నీటియందలి కీటకాలను సంహరించి శుభ్రపరచే శక్తి ఉదయకాల సూర్య కిరణాలకు మాత్రమే ఉంది. ఆ ఉదయ కాల ''అల్ట్రావైలెట్'' సౌర శక్తి తూర్పు ఈశాన్య దిశా భాగములకు తప్ప మరే భాగములకు లభింపదు.

## ఆగ్నేయదిశ:

ప్రాతః కాలం గడచి, సంగవ కాలం ఆరంభమయ్యేసరికి ఆగ్నేయ దిశా భాగంలో కొంత వరకు సూర్యకిరణ ప్రభావానికి లోనవుతుంది. సూర్యకిరణా లలోని సత్య, భృశ, ఆకాశ అనే కిరణ సమూహాలు ఆగ్నేయ దిశా భాగాన్ని ముంచెత్తుతాయి. ఇవి అగ్నిదైవతాలు,వీటిని ''ఇన్‌ఫ్రారెడ్'' కిరణాలని వైజ్ఞాని కులు అంటారు. ఈ కిరణ సమూహం కూడా ప్రాతఃకాల పరిపుష్టిని కలిగించే పర్జన్య, జయంత, ఇంద్ర, కిరణ సమూహాలు విడుదల చేసే శక్తులలో ఉష్ణ శాతం అధికంగా ఉంటుంది. అందుచేతనే ఈ కిరణాలను అగ్ని దైవతాలం టారు.

## దక్షిణ – ఉత్తరదిశలు :

భూభ్రమణవశాత్ పగలు సంగవ కాలం దాటేటప్పటికి మధ్యాహ్న కాలపు సూర్యుడు మన నడినెత్తిన వెలుగులు విరజిమ్ముతూ నిట్ట నిలువు కిరణాలతో భూమాతను తపింపజేస్తూ ఉంటాడు. ఈ సమయంలో విడుద లయ్యే సూర్య కిరణాలకు బ్రహ్మ అధిదేవత. ఈ బ్రహ్మ తన అధీనమైన కిరణసమూహాన్ని రెండు సమ భాగాలుగా విభజించి దక్షిణోత్తర దిశలకు సమంగా విడుదల చేస్తాడు. సూర్య బింబానికి దక్షిణ దిశగా వెలువడే కిరణాలకు యముడు అధిష్ఠాన దేవత. ఉత్తర దిశగావెలువడే కిరణాలకు సోముడు అధిదే వత. ఈ కిరణ పుంజాలనుండి వెలువడే ఖనిజ, లవణ, ధాతువక్తులు భూమం డలం మీద చెట్లు, చేమలు పెరుగుటకు, ఫల పుష్ప లతాదులు వృద్ధి పొందు

టకు మూలకములవుతాయి. అంతేగాక మేఘాల ఉత్పత్తికి ఈ కిరణ సమూహాలే మూలకారకములు. ఈ విధంగా మధ్యాహ్న కాలపు అధిదేవత బ్రహ్మ తన సృష్టికి కావలసిన అవసరాలను అందిస్తాడు.

## నైఋతి – వాయువ్యదిశలు :

ఈ రెండు దిశల భూ భాగం మీద మధ్యాహ్న, అపరాహ్నకాలపు సూర్య కిరణాలు ప్రభావం చూపుతాయి.

## పడమరదిశ :

సూర్య రథం పడమర దిశయందు క్షితిజరేఖ వైపునకు సాగిపోయే కొద్దీ సాయాహ్న కాలం ఆరంభమౌతుంది ఆ కాలంలో భూమికి ప్రసారం అయ్యే సూర్యకిరణాల శక్తి ప్రాతఃకాలంలో ప్రసారమయ్యే సూర్యకిరణాల శక్తికంటె విలక్షణమైనది. సాయం కాలపు సూర్య కిరణాలలో పశ్చిమ దిశాధిపతియైన వరుణ దేవుని శక్తి అధికంగా ప్రసారమౌతుంది. ఇందులో ఓషధీ గుణాలు అధికంగా ఉంటాయి. ఈకిరణాలు ప్రాణులకు ఎంతో మేలుచేస్తాయి. అందు చేత పడమర దిగ్భాగము చాలా శక్తివంతమైనదని వాస్తుశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

పై నుదహరించిన కారణాల చేత ఆయా దిశా భాగాలు తగినంత విశాలంగా లేని యెడల సూర్య కిరణాల ప్రభావం తగినంతగా ఆయా దిశలకు లభించదు. ఆ కారణంచేత ఆయా దిక్పతులు బలహీనులై యజమానికి మేలు చేయరు. ఈ విధంగా నిర్మాణ క్షేత్రమునందలి దిశా భాగములు ఆయా కిరణ ప్రసార శక్తి చేత బలీయములై ఆయా దిశలకు చెప్పబడిన సత్ఫలితాలనందిస్తాయి. ఈ పై చెప్పబడిన వివరణ అంతా స్వకపోల కల్పితం, ఊహాగానం మాత్రం కాదు. 'అపరాజితపృచ్ఛ' అనే ప్రాచీన వాస్తుశాస్త్ర గ్రంథంలో చెప్ప బడినవైజ్ఞానిక వివరణలో అయిదుశాతం మాత్రమే ఇక్కడ వివరింప బడినది. ఇంకా వివరణ కావలసినవారు 'అపరాజితపృచ్ఛ' ను పరిశీలింపగలరు.



## దిక్కులు - దిక్పతుల ప్రభావం

ఆయా దిక్కులు, ఆయా దిక్పతుల ప్రభావానికి లోనయి గృహ యజమానికి శుభా శుభ ఫలితాలను ప్రసాదిస్తాయి. అంతేగాదు ఆయా దిక్కులకు అధిదేవతలైన గ్రహాల యొక్క గుణ గణాలకు స్వభావాలకు ప్రతిస్పందించి ఆ గృహాలలో నివసించేవారికి ఆయా స్వభావాలను ఆపాదింపజేస్తాయి. కాబట్టి ప్రతి దిశయందు ఆయా దిక్పతులు అధిదేవతలైన గ్రహాలు ఎంతమేరకు తమ తమ ప్రభావాన్ని చూపిస్తాయో పరిశీలిద్దాం.

### 1. తూర్పుదిశ:

తూర్పు దిశకు అధిపతి ఇంద్రుడు. దేవతలకు ప్రభువు. రాజ్యాధికార దర్పం గలవాడు. అష్టైశ్వర్య సంపన్నుడు. ఆ ఇంద్ర దిక్పతి బలవంతుడై ఉంటే అనగా ఆ దిశ ఇంటికి తగిన వైశాల్యం కలిగి ఉంటే ఆ గృహయజమాని మంచి రాజకీయనాయకుడు చతురుడు పరిపాలనా సామర్థ్యం గల ప్రజానాయకుడు అష్టైశ్వర్య సంపన్నుడు కాగలడు.

ఈ తూర్పు దిశకు రవి అధిదేవత. ఇతడుగ్రహరాజు. సర్వశక్తి సమన్వితుడు. రాజకార్య దురంధరుడు. శివభక్తిని ప్రసాదించువాడు. శౌర్య పరాక్రమములు గలవాడు. కాబట్టి ఈ తూర్పు దిశ తగిన వైశాల్యము కలిగి యున్నచో గృహ యజమాని రాజ్యాధికారము చెలాయింపగలడు. అనేక రాజకీయ పదవులు పొందగలడు. మంచి చురుకుదనము, పుత్రపౌత్రాభివృద్ధి కలిగి యుండును. ఆ గృహమునందు నివశించువారు పౌరుషవంతులు విద్యాభివృద్ధి కలవారు కీర్తివంతులు పురుషాధిక్యతకలవారు అగుదురు మరియు మిక్కిలి ఆత్మ విశ్వాసము గల వ్యక్తులుగా రూపొందగలరు.

ఈ తూర్పుదిశ యందు అష్టసిద్ధులలో మొదటిదగు మహాలక్ష్మి నివశించు చుండును. ఆ మహాలక్ష్మి యొక్క ప్రభావముచే ఆ గృహస్తుడు సర్వ సంపదలు పొంది సుఖ జీవనము గడుపువాడగును. ఈ తూర్పు దిక్కు తగినంత వైశాల్యము లేకుండా లోపించి యున్నచో పైన చెప్పిన ఫలితాంశములు నశించి అష్ట దరిద్రములు అనుభవించును. ఆ దిశయెంతగా లోపించిన అంత చెడు ఫలితములు అనుభవమునకు వచ్చును. పూర్తిగా లోపించి యున్నచో

వంశ నాశనము పొంది బంధు పుత్రాదులకు దూరమై కష్టము లనుభవించును.

**ఆగ్నేయదిశ :**

ఈ దిశకు అగ్ని అధిపతి. సర్వభక్షకుడు ఉష్ణశక్తి కలవాడు. దుందుడుకు స్వభావము కలవాడు. అగ్ని బలవంతుడైనచో గృహయజమాని సహజముగా పవిత్రుడగును. కాని దుడుకు స్వభావము గలవాడు. శీఘ్ర కోపిష్ఠి అగును. అందు నివశించువారు, పిల్లలు కూడ దుందుడుకు స్వభావము కలిగియుందురు. యేది మంచి యేది చెడు అని విమర్శనాజ్ఞానము తక్కువై మూర్ఖ స్వభావము కలిగి యుందురు. యజమాని తనకు తాను అపకారము చేసుకొనువాడగును.

ఈ ఆగ్నేయ దిశకు అధిదేవత కుజుడు. పరాక్రమవంతుడు. కోపిష్టి. మూర్ఖత్వమే సహజ స్వభావముగా గలవాడు. వ్యవసాయమునకు కారకుడు. ఇతరులతో వాగ్వివాదము చేయువాడు. కలహప్రియుడు. దేశాలు తిరుగుట యందు అభిరుచి గలవాడు. ఇతరులను అకారణముగా నిందించు అలవాటు గలవాడు.

ఆగ్నేయ దిశ బలము గలిగియున్నచో అనగా ఉండవలసిన దానికంటె పెరిగి యున్నచో పైన చెప్పిన గుణ గణాలు, స్వభావాలు ఆ గృహము నందు నివశించు జనులకు ఆవహించును. మానసిక స్థిమితము ఉండదు.

'ఆగ్నేయ ప్రాచీకం వాస్తుసర్వదోషకరం భవేత్

దేహరోగోవిత్తనాశో బంధుహానిర్భవిష్యతి'।

అనగా తూర్పు ఆగ్నేయం పెరిగి యున్నయెడల అనేక దోషములు కలుగును. ధన నష్టము, బంధువులు లేకుండుట జరుగునని భావము. కోర్టు లావాదేవీలలో కూడ చిక్కుకొనువాడగును. అంతేగాక

'మాషమాత్రంతు మీశాన్యం,పుత్రదారాది లాభకృత్

వ్రీహమాత్రంతు ఆగ్నేయం సర్వగ్రహ భయంతథా

దేహరోగోవిత్తనాశో బంధు హానిర్భవిష్యతి

అనే ప్రాచీన కారిక ననుసరించి, మినప గింజంత అయినా ఈశాన్యం పెరిగి ఉంటే పుత్రులు, భార్య, పిల్లలతో సుఖంగా కళ కళలాడుతూ అ యిల్లు

శోభించును కాని వర్ల గింజంతయినా ఆగ్నేయ దిశ పెరిగిన అనేక గ్రహ పీడా దోషములు ఆవహించి యుండును. అందు నివసించువారు రోగగ్రస్తులై, చర్మ వ్యాధులు దగ్గు లేక టి.బి.మొదలగు వ్యాధులు కలిగియుందురు. హాస్పటలే ఆ యింటి వారికి యిల్లగుచుండును. కాబట్టి యెంత మాత్రము తూర్పు ఆగ్నే యంగాని దక్షిణ ఆగ్నేయం గాని పెరిగి యుండరాదు.

'ఆగ్నేయ ప్రాచీసంయుక్తం సర్వదోషకరం భవేత్
ఆగ్నేయ ప్రాచీకంవాస్తు తస్మాత్సర్వం విసర్జయేత్'
మానసారం 17 పేజీ

కాబట్టి ఆగ్నేయ దిశ పెరుగుదల యెంత మాత్రము అంగీకరింపరాదు.

**దక్షిణ దిశ :**

ఈ దిశకు అధిపతి యముడు. యముడనగానే చాలా మందికి భయం. కాని యముడు సమవర్తి. ధర్మ సంరక్షకుడు న్యాయా న్యాయములను విచారించు ధర్మ పరిపాలకుడు. అనగా సాక్షాత్తు పరమేశ్వరుడే. కాబట్టి ఈ దిశ యింటికి తగినంత వర్గునుసరించి వైశాల్యము కలిగియున్న ఎడల గృహ యజమాని స్వార్ధము లేనివాడై ధైర్యవంతుడై పరోపకార పరాయణుడై న్యాయా న్యాయములను విమర్శించువాడై ధర్మ మార్గమున జీవించువాడగును. కష్ట సుఖములను సమవర్తియై సమానముగా భావించువాడగును.

ఈ దక్షిణ దిశకు అధిదేవత శుక్రుడు. ఈ శుక్రుడు బలవంతుడైనచో అనగా దక్షిణ దిశ వర్గా రూఢమునకు తగిన విధముగా వైశాల్యము కలిగి యున్న యెడల సమస్త సంపదలు గృహ యజమాని పొందుచుండును. వాహనాలలో తిరిగెడి వాడగును సంగీత నృత్యములన్న అందు నివశించు పిల్లలు చెవి కోసు కొందురు. గృహ యజమాని రాజకీయ ముద్రాధికారము కలిగి మంచి రాజ కీయ పదవులు పొందుట గాని లేదా మంచి ఉద్యోగము గలవాడు గాని అగును విలాస పురుషుడగు అవకాశము కూడ వున్నది ఈ దిశ తగు విధంగా బలపడి యున్న యెడల అష్టసిద్ధులలో మూడవదగు మహేశ్వరీదేవి అనుగ్రహం చేత ప్రజా నాయకుడై కీర్తి ప్రతిష్టలు పొందును

గమనిక: దక్షిణము కాళీ ఉండరాదనే ఆధునికుల వాదము శాస్త్రసమ్మతము కాదు మనశాస్త్రములలో 'క్రోశమేకంతు దక్షిణే' అని యున్నది.

## నైఋతి దిశ :

నైఋతి దిశకు దిక్పతి నిఋతి అనే రాక్షసుడు క్రూరుడు. హింసా ప్రవృత్తి గలవాడు. యితరులను హింసించి ఆనందించు వాడు. నిరంకుశుడు. ఈ నైఋతి దిక్పతి బలవంతుడైనచో ఆ గృహ యజమాని నిరంకుశుడు. యెదుటి వారి మాటను నిర్లక్ష్యము చేయు వాడగును. ఇరుగు పొరుగు వారిని హింసించి ఆనందించు వాడగును. ఇందు నివశించువారి సంతానము కళా విహీనమై చెప్పిన మాట వినక దేశ ద్రిమ్మరులగుదురు. శత్రువుల చేత పీడింప బడును. క్రమ క్రమముగా వంశము నశించును.

ఈ నైఋతి దిశకు అధిదేవత బుధుడు ఈ బుధుడు బలవంతుడైన చో గృహ యజమాని మేనమామల యెడల అభిమానము కలవాడై యుండును వాక్చాతుర్యం చేత తన కార్యము సాధించుకొనును. బుద్ధిబలము చేత మంచి వ్యాపార కుశలుడై కళల యందు కూడ అభిమానము కనబరచును.

## పడమర దిశ :

ఈ పడమర దిశకు దిక్పతి వరుణుడు. ఇతడు జలాధి దేవత. ఈ పడమర దిక్పతి బలము కలవాడైనచో అనగా యింటికి పడమర దిశ యింటికి తగినకాళీ కంటె అదనముగా పెరిగి యున్న యెడల ఆ యింటి యందు స్త్రీల పెత్తనము చెల్లుచుండును. పురుషులు మౌన ముద్ర వహింతురు. యింటిలోని వారందరు మితిమీరి ఖర్చు చేయుచుందురు. ఆదాయము ఎంతగా వచ్చినను నిలవ వుండదు. కాని ఆ యింటి పిల్లలు చదువులందు శ్రద్ధవహింతురు

ఈ పశ్చిమ దిశకు అధిదేవత బృహస్పతి దిక్పతి సామాన్యుడైనా అధిదే వత మిక్కిలి శుభుడు. కాబట్టి వర్గారూఢమును అనుసరించి యింటికి తగి నంత పడమర కాళీ స్థలము ఉన్న యెడల గృహ యజమానుడు దేహపుష్టిగలిగి ధన సంపదలతో కీర్తి మంతుడగును. ఇతరులను నొప్పింపక మాటలాడును. దాతృత్వము యితరులకు మేలు చేయువాడగును. రాజకీయ పరిజ్ఞానము గలిగి రాణింపగలరు. దేవబ్రాహ్మణ భక్తి కలిగి స్త్రీలు సౌభాగ్యవంతులై కీర్తిని పొంది యుందురు.

## వాయువ్యము :

వాయువ్య దిశకు దిక్పతి వాయుదేవుడు. యితడు అస్థిర స్వభావము

గలవాడు. దేశసంచారి. మాట నిలబెట్టు కొననివాడు. శారీరక పుష్టి, బలవంతుడు.

ఈ వాయుదేవుడు బలవంతుడైనచో అనగా వాయవ్య దిశ యిటు పడమరకు గాని, ఉత్తరానికి గాని పెరిగియున్న యెడల అ గృహ యజమాని యెంత ధన సంపాదన గలిగియున్నను దేశ సంచారియై నిలకడలేక ధనవ్యయం చేస్తూ దరిద్రుడగును. అనేక యిండ్లు నిర్మించువాడగును. అందు నివశించు స్త్రీలు పిల్లలు చంచల స్వభావము కలవారై ప్రవర్తింతురు.

ఈ దిశకు అధిదేవత శని. ఈ శని బలవంతుడైనచో అనగా వాయవ్య దిశ పెరిగి యున్నచో గృహ యజమానుడు అందు నివశించువారు సోమరిపోతుల గుదురు. పిల్లలు చంచల స్వభావులై చదువు సంధ్యలు రానివారై అల్లరి చిల్లరగా తిరుగుచుందురు. అకారణ కోపము కలిగి కార్యహాని కలుగ చేసుకొందురు. వీరికి గ్రామదేవతా ఉత్సవములన్న యిష్టము.

**ఉత్తర దిశ :**

ఈ ఉత్తర దిశకు కుబేరుడు దిక్పతి. స్థిరమైన సంపదలు గలవాడు. నవనిధులు అతనికి సొంతం. మిక్కిలి శుభఫలప్రదాత. అతని నాశ్రయించిన వారికి అష్టైశ్వర్యములు అందించే దేవత. సహృదయము గలవాడు.

ఈ ఉత్తర దిక్పతి బలవంతుడైయున్నచో అనగా ఉత్తరదిశ యింటికి తగినంత వైశాల్యము కలిగి యున్న యెడల అ గృహము నందు నివశించువారు మహారాజ భోగములనుభవింతురు. ప్రజలు ఆ యింటి యజమాని మాటను దైవాజ్ఞగా భావించి గౌరవింతురు. శత్రువులు కూడ మిత్రులు కాగలరు. అధికార పదవులు అతని వద్దకు వరించి వచ్చును. అష్టైశ్వర్యములను అందించు దిశ ఉత్తరదిశ మాత్రమే. ఆ దిశగృహ యజమానిని మంచి దశగలవానిగా చేయును.

ఈ ఉత్తర దిశకు అధిదైవతం చంద్రుడు. మిక్కిలి శుభఫల ప్రదాత. ఈ చంద్రుడు బలవంతుడైనచో ఈ గృహ యజమాని మనస్సు చల్లగా సర్వ జన శ్రేయస్సు కోరుచుండును. సద్గుణ సంపన్నుడు పరోపకారి ప్రజల కోరికలు తీర్చువాడగును. అందు నివశించే బాల బాలికలు తల్లి దండ్రులను పూజించే వారగుదురు. మంచి విద్యా బుద్ధులునేర్చి వివేకవంతులైగొప్పగొప్ప ఉద్యోగాలు చేస్తూ విదేశాలకు కూడ వెళ్ళగలరు. వేయేల ఉత్తరదిశ తగినంతగా వైశాల్యము

కలిగియున్న యిల్లు నందనోద్యానమై ఆనందదాయిని అగును. అందలి సంతానము శుక్లపక్ష చంద్రుని వలె దిన దిన ప్రవర్ధమానమై వృద్ధి పొందును

**ఈశాన్య దిశ :**

ఈ దిశాధిపతి ఈశానుడు అనే రుద్రుడు శుభఫల ప్రదాత వంశ వృద్ధిని కలుగజేయువాడు. భోలా శంకరుడు వరప్రదాత ఈ ఈశాన్య దిశ తూర్పు ఉత్తరములకు కొలదిపాటి పెరిగియున్నచో అనగా తగినంత వైశాల్యము కలిగియున్న యెడల ఆగృహము అష్టైశ్వర్యములతో తులతూగుచుండును. ప్రజలు ఆ ఇంటి యజమానుని మాటకు కట్టుబడి యుందురు. ఆ ఇంటియందు నివశించు వారికి ఆ గృహ యజమానుని మాట వేద వాక్కు. ఆయురారోగ్య ఐశ్వర్యములు గల ఇల్లుగా నందన వనంగా ఆనంద నిలయంగా అలరారుచుండును.

ఈ ఈశాన్య దిశకు అధిదైవతము చంద్రుడు ఈ చంద్రుడు ఉత్తర దిశకు ఇచ్చే ఫలితాన్నే ఇవ్వగలడు అందుచేత ఉత్తర ఈశాన్య దిశలు రెండూ కలసి ఉండుటయే గాక ఫలితాలను కూడా సమానంగా ఇస్తాయి. ఇంటికి ఈ ఉత్తర ఈశాన్య దిశలు తగినంతగా వైశాల్యం కలిగియుండి ఆ దిశా భాగంలో ఎత్తైన చెట్లు పొదలు లేకుండా తగినంత సూర్యరశ్మిని గ్రహించుటకు సమర్ధమైనచో ఆ గృహము అష్టైశ్వర్యములతో కలకాలం కళ కళలాడుతూ వర్ధిల్లుచుండును.

గమనిక : ఈ పైనుదహరించిన వివరణ వాస్తు - జ్యోతిషశాస్త్రాల పరిశోధనతో మనకు లభ్యమైనది. జ్యోతిష శాస్త్రంలో భాగమే వాస్తు శాస్త్రం. జ్యోతిష శాస్త్రం లేకపోతే వాస్తు శాస్త్రం నిర్వీర్యమగును. వాస్తు శాస్త్ర సంబంధం లేకపోయినా జ్యోతిష శాస్త్రం స్వయం ప్రతిపత్తి కలిగి ఉంటుంది. కాబట్టి వాస్తు జ్యోతిష శాస్త్రాలు రెండూ అవినాభావ సంబంధాలు కలవిఅయి వర్ధిల్ల గలవు

☆ ☆ ☆



## సత్యం-శివం-సుందరం

సత్యం - శివం - సుందరం అనే ఆర్యోక్తి వేదార్థాల, నిగమాగమాల సారభూతమైనది. సత్యం సాక్షాత్తు పరమేశ్వర స్వరూపం. ఆది మధ్యాంత రహితమైన పరాశక్తి స్వరూపమే ఈ సత్యం. అట్టి పరాశక్తి యొక్క హృదయమే శివం. శివం అంటే సమస్త లోకాలను మంగళప్రదంగా చేసే భావన. సుందర మంటే అనిర్వచనీయమైన, సౌందర్య శోభా విలసితమైన, అపరాశక్తి స్వరూపమే జగన్మాత. పరాప్రకృతి యొక్క దర్శనీయ భౌతిక రూపమే ''సుంద రము' ఈ సమస్త దృశ్యమాన జగత్తునందలి ప్రకృతి సౌందర్యాన్ని దర్శించి పరవశించిపోని ప్రాణులు ఉంటాయా? ఉండనే ఉండవు. సమస్త ప్రాణికోటిని ఆనందపరచే ఈ పంచ భూతాత్మకమైన ప్రకృతి సౌందర్యం బహు సుందరం ఆనంద వర్ధనం.

అట్టి దివ్యమైన, ఆనంద వర్ధకమైన భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే పంచ భూతాత్మకమైన పరాప్రకృతి యొక్క ప్రతిబింబ రూపుడే పురుషుడు. ఆదివ్య పురుషునకు వారసుడే మానవుడు. ఆ మానవుని చర్యలన్నీ మూల పురుషుడైన ఆ దివ్య పురుషుని ప్రేరణకు అనుకూలంగానే, స్పందించి ముందుకు సాగుతూ ఉండాలి. మంచి ప్రవర్తన, శీల సంపద గలవాడే మానవ జాతులలో పూర్ణ పురుషుడుగా పరిగణింప బడతాడు.

అయితే అట్టి పూర్ణ పురుష లక్షణాలు ఏ విధంగా ఉండాలి? సత్యం అనగా సత్య వాక్కు గలవాడు, శివం అనగా సర్వ కాలముల యందు లోక కళ్యాణమే పరమావధిగా గలవాడు, సుందరమనగా సమస్త శుభ లక్షణ సంపన్నుడు తన్ను దర్శించేవారి కన్నులకు చరితార్థత ఆపాదించే వాడై ఉండాలి.

ప్రాచీన భారతీయ ఋషులు తమ తమ తపశ్శక్తితో ఈనాటి సైన్సుకు మించిన వైజ్ఞానిక రహస్యాలను అవగాహన చేసి కొన్నారు. మానవ మేధా శక్తిని మానవ శక్తిని అంచనా వేసి, అందలి నిగూఢ రహస్యాలను వెలికి తీసి, వేద ఆగమ శాస్త్రాలలో గుప్త పరచారు. అట్టి అతీంద్రియ శక్తిసంపన్నులైన మన శిల్ప ఋషులు తమ తమ మేధా శక్తితో పూర్ణ పురుషస్వరూపానికి ప్రతీకగా ఊహించి వర్ణించిన స్వరూపమే వాస్తు పురుష స్వరూపం. వాస్తు పురుషుడనగా గృహ స్వరూపుడైన

గృహ పురుషుడే. మహా శక్తివంతమైన మానవ మేధస్సుతో రూపొందించిన గృహ పురుషుడు లోకకళ్యాణ కారకుడై వర్ధిల్లు చుండును.

అందుచేతనే గృహ పురుషుని, పూర్ణ పురుష స్వరూపంగా భావించి సమస్త శుభ లక్షణ సమన్వితంగా ఊహించి, సత్యం - శివం - సుందరం అనే ఆర్యోక్తికి అనుగుణంగా భావన చేసి, గృహరూపకల్పన చేయాలని వాస్తు శాస్త్రం నిర్దేశించింది. ఆ విధంగా భావనచేసి రూపకల్పన చేసిన గృహం, ఆ స్థపతి యొక్క భావనా బలం చేత యజమానికి సర్వ సౌఖ్యాలను ప్రసాదిస్తుందని మన శిల్ప ఋషుల విశ్వాసం.

చతుర్విధ పురుషార్థ సాధనకు మూలకందమైన గృహ స్వరూపాన్ని రూపకల్పన చేసే స్థపతులు, సిద్ధాంతులూ కూడ ఋషితుల్యులై ఉండాలని భారతీయ వాస్తు శాస్త్రాలు నిర్దేశిస్తున్నాయి సత్యం శివం సుందరం అనే భావనకు తమ మానసిక శక్తిని జోడించి, గృహ స్వరూపానికి రూపకల్పన చేసే వాడే నిజమైన సిద్ధాంతి కాగలడు. అతనికి లోక కళ్యాణమే పరమావధిగా ఉండాలి. అంతేగాదు, గృహ రూపకల్పన చేసే స్థపతి అనే సిద్ధాంతి గృహ నిర్మాణ క్షేత్రంలో కూర్చుండి తన భావనా బలంచేత గృహ ప్రవేశసమయంలో ఆగృహ పురుషుని పరిపూర్ణ సౌందర్యాన్ని దర్శించ గలవాడై యుండాలి ఆ విధమైన భావనా పటిమ, శాస్త్ర విజ్ఞానం గల స్థపతి చేత, రూపుదిద్దుకొన్న గృహం, దర్శనీయమై, నేత్రానందకరమై, ప్రకాశిస్తుంది. ఆ ఇంటి యందు నివశించే వారికి ఆనందం అర్ణవమై ఉప్పొంగి, లోకంలో కలకాలం వర్ధిల్లుతూ ఉంటుంది.

భారతీయ వాస్తు శాస్త్రంలో వర్ణింపబడినగృహ పురుష అంగాంగ వర్ణన యెట్టిదో మనం గమనించాలి -

సమస్త నిర్మాణపు ఆకార విశేషమే, పూర్ణ పురుషుడైన గృహ పురుషుడు. ఆ గృహ పురుషుని ముఖమే ముఖద్వారం. ద్వారమునకు రెండు ప్రక్కల గల కిటికీలు నేత్రములు. చిప్ప తట్టుల యందు గల కిటికీలు కర్ణ రంధ్రాలు అనగా చెవులు. యింటికి వెనుక భాగము పృష్ఠ భాగము అనగా వీపు. సింహ ద్వారమునకు ముందుగల ఖాళీ స్థలము (ముంగిలి) గృహపురుషుని ఊపిరి తిత్తులు. గర్భగృహము గృహ పురుషుని గర్భము, స్తంభములు పాదములు, వెన్ను వాసము గృహ పురుషుని వెన్నుదండి. సాధారణ మానవుడు యేవిధంగా పంచ భూతాల కలయిక చేత రూపుదిద్దుకుంటాడో, గృహ పురుషుడు కూడా పంచభూతత్మకమైన పదార్థాల చేతనే రూపుదిద్దుకుంటాడు.

గమనించండి :

గృహ పురుషుడు అనే యింటికి, చుట్టూరాగల ప్రహరీ గోడ శరీర రక్షక కవచం అనే చర్మం. ఆ ప్రహరీ గోడ లోతట్టునగల కాళీ ప్రదేశం, ఆకాశ భూతానికి చెందినది. గృహ నిర్మాణానికి ఉపయోగించిన ఇటుకలు, సున్నం, సిమెంటు, కలప మొదలైన పదార్థాలు, పృధివీ తత్వానికి చెందినవి. నీటి కుళాయిలు నూతులు నీటి కుండీలు మొదలైనవి జలతత్వానికి చెందినవి. గర్భ గృహ వైశాల్యం, ఎత్తు తెరపిగా వుండే వరండాలు, మొదలైనవి గూడ ఆకాశతత్వానికిచెందినవవి ఇకవంటయిల్లు, అందలిపొయ్యిలు, దీపస్థలాలు మొదలైనవి అగ్నితత్వానికి చెందినవి. గుమ్మాలు, కిటికీలు మొదలైన వాయు ప్రసార సాధనాలు, వాయుతత్వానికి చెందినవి. గృహ పురుషుడు ఈ విధంగా పంచ భూతాత్మకమైన అయిదు తత్వాలను తనలో యిముడ్చుకొని పూర్ణ పురుషుడై చైతన్యవంతుడై ప్రకాశిస్తూవుంటాడని శాస్త్రాలుచెపుతూ వున్నాయి.

ఇంత వరకు గృహ పురుషవర్ణన చేశాం. మరి ఆ గృహ పురుషునికి పిండోత్పత్తికాలం యెప్పుడౌతుందో కూడా మనం గమనించాలి. మానవ శిశు వునకు పిండోత్పత్తి కాలం ఉంది కదా, ఆ విధంగానే శంకుస్థాపన సమయము గృహ పురుషుని పిండోత్పత్తి కాలం అని శాస్త్రాలు చెపుతున్నాయి. మండపారా ధన వాస్తు పురుషారాధన జరిపి, స్థపతి శంకువు లేక ప్రధమేష్టి కాన్యాసాల కాలంలో, గృహ పురుషునికి ప్రాణ ప్రతిష్ట, చైతన్య ప్రసారం చేస్తాడు. ఆ భావనా బలమే యింతింతై సంపూర్ణ గృహ స్వరూపంగా రూపు దిద్దుకుంటుంది. ఆ పిమ్మట గృహ నిర్మాణం పూర్తి అయిన తర్వాత, గృహ ప్రవేశ సమయానికి ముందురోజు రాత్రి, సమర్ధుడైన స్థపతి తన భావనా బలం చేత గృహ పురుషు నిలో చైతన్య ప్రసారం చేసి, వాస్తు పురుష మండపారాధన జరిపి, ప్రాణ ప్రతిష్ట చేసి, షోడశ కళలను అందు నిక్షిప్తం చేస్తాడు.

ఆ విధంగా స్థపతి, ఆ గృహపురుషునిలో పరాశక్తి ప్రతీకాలైన సత్యం, శివం, సుందరం అనే భావాత్మకమైన శుభ లక్షణాలను న్యాసం చేస్తాడు. ఆ మరునాడు శుభముహూర్తాన దంపతులు వాస్తు పురుషుని పూజించి నవగ్రహా రాధన, బ్రహ్మ మండపారాధన చేసి, నూతనగృహ ప్రవేశం చేస్తారు. ఆ విధంగా గృహ పురుష స్వరూపం, షోడశ కళాప్రపూర్ణుడైన పున్నమినాటి చంద్రుని వలె ప్రకాశిస్తుంది.



ఈ సమస్త చరాచర జగత్తునందంతట ప్రత్యణువు నందు అవిచ్ఛిన్న ముగ పరివ్యాప్తి చెంది యున్న ఆ పరాశక్తి స్వరూపమే చైతన్యం. ఆ దివ్యచైతన్య శక్తి ప్రకృతి శక్తిగా రూపాంతరంచెంది కాలచక్రం అనే సాధనతో ఈ శింశుమార చక్రాన్ని గిరగిరా త్రిప్పుతూ, సూర్య, చంద్ర, నక్షత్ర గ్రహ తారకా సముదాయాన్ని క్రమం తప్పకుండా చలింపజేస్తూ జీవరాసుల మనుగడకు దోహదం చేస్తున్నది.

ఈ సృష్టియందలి ప్రతి పదార్థంలోను అంతర్గతంగా ఉన్న ఆ చైతన్య శక్తి ఆయా పదార్థాల యొక్క ఆకార ప్రకారాలకు తగిన ప్రమాణంలో ఆవరించి వుంటుంది. ఆ చైతన్య శక్తి యొక్క ప్రభావం చేత, ఆయా పదార్థాల నుండి, ఆయా పదార్థాల ఆకార ప్రమాణాలకు తగిన విధంగా, కిరణ ప్రసారం జరుగుతూ ఉంటుంది. ఆ కిరణాలు మన కంటిలోని రెటీనా అనే కంటిపాపకు తాకగానే, ఆ వస్తువును మనం గుర్తించ గలుగుతాం. ఈనాటి వైజ్ఞానికులంతా దీనిని ధృవీకరిస్తున్నారు.

అయితే, పదార్థం నుండి వెలువడే కిరణాలు అనగానే సూర్య కిరణాల వలెనో, చంద్ర కిరణాల వలెనో ఉంటాయి అనుకోకూడదు కాంతి అంటే మనం మామూలుగా అనుకొనే తెల్లని వెలుగే కాదు. పదార్థం నుండి వెలువడే కిరణాలకు ఏ విధమైన రంగు ఉండక పోవచ్చు. ఏ పదార్థమైన మన దృష్టిగోచరం అవుతున్నదంటే, ఆ పదార్థం నుండి కిరణ ప్రసారం జరుగుతున్నదన్నమాట.

కాబట్టి, చరాచర జగత్తు నందలి ప్రతి పదార్థం, తన స్థాయికి తగినంత చైతన్యం కలిగి యుంటుందని గమనించాం. అయితే ఈ చైతన్యం మనుషులలో అధికంగా ఉంటే జంతువులలో కొంత తగ్గి వుంటుంది. చెట్లు, పొదలు, లతలు, తీగలు, ఫల పుష్పాలలో యింకా తక్కువగా ఉంటుంది. మొత్తం మీద పిపీలికాది బ్రహ్మపర్యంతం, ఈ చైతన్యం ఆశ్రయించి ఉంటుంది.

చెట్లు పొదలు, లతలు, తీగలు, ఫల పుష్పాలలో కూడా చైతన్యం ఉందని వీటికి కూడా మానవులవలె సుఖ దుఃఖాలు ఉన్నాయని, డా. జగదీశ్ చంద్రబోసు వైజ్ఞానిక పద్ధతిలో ఋజువుపరచారు. పై విషయాలు అవగాహన చేసుకొంటే సృష్టిలో ఆకార విశేషానికి చాలా ప్రాముఖ్యముంది. అందుకే పెద్దలంటారు- ''ఒక్కో ముఖం చూస్తే పెట్టబుద్ధి, ఒక్కో ముఖం చూస్తే కొట్టబుద్ధి'' అని అందుకు కారణాలు ఆయా వ్యక్తుల యొక్క ముఖారవిందాలు విడుదల చేసే ఆకర్షణ వికర్షణ శక్తులటువంటివని పిండితార్థం. అందుచేతనే, మనకు కొన్ని వస్తువులను చూడగానే హృదయాంతరాళము నుండి ఆనందము పెల్లుబుకుతుంది. ఆ ఆనంద తరంగాల తాకిడికి మన శరీర యంత్రాంగం ప్రతిస్పందించి, అనేక జీవ రసాయనిక ప్రకియలకు లోనై, కాంతి కిరణాలను విడుదల చేస్తుంది. ఆ కాంతి కిరణాలు, ఆ వ్యక్తి చుట్టూ కాంతి వలయంగా రూపుదిద్దు కొంటాయి. ఆ కాంతివలయమే '' ఆరా''గా యేర్పడుతుంది. అరా అనగా ప్రతి పదార్థానికి చుట్టూరాయేర్పడి ఉండే జీవకాంతి. ఈ జీవకాంతినే వైజ్ఞానికులు ''ఆరా'' అని పిలుస్తారు. ఈ జీవ కాంతిని మనం మామూలు కంటితో మాత్రం చూడలేం. కానీ యోగులు, ఈ కాంతిని స్పష్టంగా చూడగలరు. బౌద్ధ సాహిత్యంలోనూ, థియసాఫికల్ సాహిత్యంలోనూ ఇంకా చైనా, టిబెట్ మొదలగు దేశాలలోను, బౌద్ధ పండితుల ద్వారాను ''ఆరా'' గురించి విపులమైన వర్ణనలున్నాయి. అందుకు సాక్ష్యంగా మన భారతీయ దేవతల యొక్క చిత్రాలలో, దేవతల-తలల చుట్టూరా గుండ్రని కాంతి వలయం చిత్రించ బడుతూ వస్తుంది.

ఈ జీవకాంతి, మానవునిచుట్టూ ఆ పాదమస్తక పర్యంతము అండాకారంగా వ్యాపించి యుంటుందని, థియసాఫికల్ వారి సాహిత్యంలో వర్ణించబడినది. ఆయా వ్యక్తుల గుణగణాలకు అనుగుణంగా కాంతిలో భేదం ఉంటుంది. రోగగ్రస్తులైన వారి ''ఆరా''లో నల్లని చారలు ఏర్పడతాయి. ఆరోగ్యవంతుని ''ఆరా'', లేత గులాబీ రంగులో కాంతులు విరజిమ్ముతుందని వ్రాయబడి ఉంది.

ఈ ఆరా, జడపదార్థాలకు కూడా ఉంటుందని గదా మనం చదివాం జడపదార్థాల ''ఆరా'' బలహీనంగా ఉంటుంది. కారణం ఏమంటే, ఆ జడప దార్థాల యందలి చైతన్య ప్రమాణం తక్కువ కావడమే.

ఈ ఆరా గురించి అనేకమంది ఆధునిక శాస్త్రవేత్తలు కూడా, వైజ్ఞానిక పద్ధతిలో పరిశోధించి నిర్ణయించారు. రష్యాలో ప్రముఖ పారా సైకాలజిస్ట్ డా. కిర్లియన్, అతని సహాయకుడు పెమియన్ అనే శాస్త్రవేత్తలు అనేక పరిశో ధనలు చేసి, వస్తువులలో గల ఈ ఆరాను ఫొటోలు తీయగలిగారు. అంతేగాక ఈజిప్షియన్, గ్రీక్, రోమన్, భారతీయ సాహిత్యాలలో ఈ 'ఆరా' అనబడే జీవకాంతి గురించి ప్రస్తావనలున్నట్లు తెలియ వస్తున్నది.

ఈ పై విషయమంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే అనేక పదార్థాల సమ్మేళనంతో రూపుదిద్దుకొని, సర్వాంగ సుందరంగా కనిపించే ఇంటికి కూడ 'ఆరా' సిద్ధాంతం వర్తిస్తుంది. గృహ నిర్మాణంలో అనేక పదార్థాలు వినియోగి స్తాము. ఆయా పదార్థాలు విడుదల చేసే కాంతి కిరణాలు సమ్మిళితమై, ఈ 'ఆరా' రూపుదిద్దుకొంటుంది. ఈ 'ఆరా' యొక్క స్వభావము యింటికి ఉపయోగించిన ఆయా పదార్థాల గుణగణాలకు అనుగుణంగా ఉంటుంది. కాబట్టి మన శిల్ప ఋషులు యేయే పదార్థాలు ఇండ్లకు వినియోగించాలో ఆయా పదార్థాలను మాత్రమే వినియోగించవలెనని నిర్దేశించారు. నిషేధింప బడిన పదార్థాలను గృహ నిర్మాణంలో ఎంత మాత్రం వినియోగించరాదు.



# ఆకారంలో అద్భుత శక్తులు

పాంచ భౌతికమైన సజీవ ఆకార విశేషానికి చాలాప్రాముఖ్యత ఉందని ''ఆరా'' ప్రకరణంలో గుర్తించాము. ఇది పాంచ భౌతికమే అయినా, నిర్జీవ జడపదార్ధాల సమ్మేళనంతో రూపుదిద్దుకున్న ఆయా కట్టడాలకు, ఈ ఆరా సిద్ధాంతం వర్తిస్తుందా? వర్తిస్తుందనే జవాబు.

గృహం, సజీవమైన నిర్జీవమైన పాంచ భౌతిక అణు సముదాయాల కూడికతోనే రూపొందింపబడుతుంది. ఏదైనా ఒక నిర్మాణాన్ని ఉదాహరణగా తీసుకొనండి. ఆ నిర్మాణం యొక్క ఎత్తు, రంగు, రూపం, ఆ నిర్మాణం లోపల గల వైశాల్యం ఆ నిర్మాణంలో ఉపయోగించే ఇటుకలు, సున్నం,కలప ఇంకా అనేక విధాలైన పదార్ధాల సమ్మేళనం, ఆయా పదార్ధాలు విడుదల చేసే కాంతి తరంగాల కలయికచేత జరిగే రసాయనిక చర్యలు, ఆయా జీవ రసాయనిక చర్యల వల్ల విడుదలయ్యే కాంతి తరంగ సమ్మేళనం, మొదలైన సామూహిక ప్రభావం చేత ఆ కట్టడానికి ''ఆరా'' రూపుదిద్దుకుంటుంది. ఈ ఆరాను మన భౌతిక నేత్రాలతో చూడలేము గనుక ''ఆరా'' లేదనుకోవడం పొరపాటు.

ఈజిప్టు అతి ప్రాచీన దేశం. ఆ దేశంలో ''పిరమిడ్లు'' అనే ప్రాచీన కట్టడాలున్నాయి. ఇవి ఎన్నో వేల ఏండ్లకు పూర్వం నిర్మింపబడి ఉన్నాయి ఈ కట్టడాలు ఖచ్చితమైన ఉత్తర దక్షిణదిశలకు అనుగుణంగా నిర్మించారు. ఈ కట్టడాలు, ఈనాటి విజ్ఞాన శాస్త్రానికి అందుబాటులో లేని అతీతమైన విజ్ఞాన సూత్రాలనుపయోగించి నిర్మించబడినవని ''విలియం పెట్రీ'' అనే శాస్త్రవేత్త అంటారు. ఆయా పిరమిడ్ల ''ఆకృతి'' ఎలక్ట్రోమేగ్నటిక్ తరంగాలను, రోదసి నుండి విడుదలయ్యే కాస్మిక్ కిరణాలను, మన వైపునకు ఆకర్షించు కొనే శక్తి కలిగియున్నదని ''చెక్'' దేశపు కారిల్ డ్రాబర్ అభిప్రాయ పడుతున్నారు.

యూరోపియన్ అతీంద్రియ పరిజ్ఞాన సంస్థవారుకూడా ''పిర

మిడ్'' లో, అట్టి అపూర్వ శక్తి పిరమిడ్స్ యొక్క ఆకృతి, నిర్మాణ దిశను బట్టి ఏర్పడుతుందని అభిప్రాయపడుతున్నారు. అంతేగాదు, ఆయా నిర్మాణములు ఏయే పదార్థాలతో నిర్మింపబడినవో, ఆయా కట్టడాలు ఆయా పదార్థాల లక్షణాలను ప్రదర్శిస్తాయని నిర్ధారించారు

ఈ విధమైన వైజ్ఞానిక దృష్టితో పరిశీలించి చూస్తే మన వాస్తు గ్రంథాలు ''మయమతం'', ''మానసారం'', ''సమరాంగణం'', మొదలైనవాటియందు వివరింపబడిన దుర్గ, సౌధ, హర్మ్య, భవనాది నిర్మాణ విశేషాలు ఎటువంటి కట్టడానికి ఎన్ని శిఖరాలు, ఎన్ని కలశాలు ఉండాలి మొదలైన అనేక విషయాలు చర్చించబడ్డాయి. ఈ ఆకృతులు నిర్మాణ సూత్రాలకు అనుగుణంగానే ఉన్నాయని అభిప్రాయం ఏర్పడుతుంది.

విశ్వకర్మ వాస్తుశాస్త్రం లోను మయమత వాస్తు శాస్త్రం లోనూ ప్రాసాద సౌధ, హర్మ్య, భవన నిర్మాణ శైలి మిక్కిలి విస్తారంగా వివరింపబడింది. ఆయా నిర్మాణాలలో, ఫలానా పదార్థమే ఉపయోగించాలి ఫలానా కలపనే వినియోగించాలి, ఫలానా చెట్ల కలపను వినియోగించ రాదు అని ఖచ్చితంగా నిర్దేశించిన, భారతీయ శిల్ప ఋషుల పదార్థ విజ్ఞానమెంత అనుభవపూర్వకమైనదో గ్రహించాలి. ఇదంతా ఎందుకు వివరింపబడుతుందంటే మన శాస్త్రాలలోని రహస్యాలను ఏ విదేశీయ ప్రముఖుడో మనకు తెలియ చెప్పేంత వరకు మనం నమ్మలేనంత అజ్ఞానానికి దిగజారిపోయాం

కాబట్టి ఇప్పటికైనా విజ్ఞానులైన పండితులు, ప్రభుత్వాలు ఈ నగ్న సత్యాన్ని గుర్తించి భారతీయ వాస్తు శాస్త్ర పరిశోధనకు పూనుకోవాలి భారతీయ వాస్తు శాస్త్రాలను ఇంజనీరింగు కళాశాలలలో అధ్యయనం చేయవలసిన దిగా పాఠ్య ప్రణాళికలు రూపొందించాలి.



# గ్రహబలం - గృహబలం

ఈ ప్రకరణంలో గ్రహబలం గొప్పదా? గృహబలం గొప్పదా? అనే విషయం చర్చనీయాంశము. ఆధునిక వాస్తు పండితులు చాలా మంది, గృహ బలం చాలా ముఖ్యమని, మానవుల సుఖదుఃఖాలకు ఇల్లే మూల కారణమని మిక్కిలిగా ప్రచారం చేస్తున్నారు. ఈవాదం ఎంత వరకు సత్యం? అనే విష యాన్ని ఈ ప్రకరణంలో పరిశీలిద్దాం.

తర తరాలుగా భారతీయుల ఖగోళ విజ్ఞానం మంచి అభివృద్ధిని సాధిం చింది. కాలక్రమంలో ఖగోళ శాస్త్రం ఆధారంగా జ్యోతిష శాస్త్రం ఆవిర్భవిం చింది. ఖగోళ విజ్ఞానానికి ''మయబ్రహ్మ'' విరచితమైన ''సూర్య సిద్ధాంతం'' అనే గ్రంథం పరమ ప్రామాణికం. నేటికీ కూడా ఈ సూర్య సిద్ధాంతం ఆధారం గానే పంచాంగ రచన సాగుతూ ఉంది. ఈ పంచాంగం ఆధారంగా గ్రహ గతులను పరిశీలించి, మానవజాతి యొక్క మంచి చెడులను, శుభా శుభ ఫలితాలను, మనుష్యుని భవిష్య జీవన విధానాన్ని తెలియజేసేదే జ్యోతిష శాస్త్రం. మాన వుడు పుట్టిన సమయం ఆధారంగా మానవ జీవన గమనాన్ని జ్యోతిషం విశదీ కరిస్తుంది. అట్టి జ్యోతిష శాస్త్రాలలో బృహత్పరాశరహోరా శాస్త్రం, కాలా మృతం, ఉత్తర కాలామృతం, సారావళి మొదలైన గ్రంథాలు సుప్రసిద్ధాలు. ఆయా గ్రంథాల ఆధారంగా, శిశువు పుట్టిన సమయాన్ని ప్రాతిపదికగా తీసి కొని, జన్మకుండలి తయారుచేసి, అందలి గ్రహస్థితిని పరిశీలించి భూత, భవిష్యత్, వర్తమానాలను చెప్పడం భారతీయ పండితులకు ఉగ్గు పాలతో అబ్బిన విద్య. ఈ విధంగా, ఖగోళ గ్రహసంచారం మానవుల మీద ఏ విధంగా ప్రభావం చూపుతుందో జ్యోతిషశాస్త్రం వివరిస్తుంది. జ్యోతిషశాస్త్రంలో వాస్తు, ఒక శాఖమాత్రమే. వాస్తు శాస్త్రం జ్యోతిష శాస్త్రం ఆధారంగా ముహూర్తాది అంశాలను గ్రహిస్తుంది. వాస్తు శాస్త్రానికి గల కొన్ని మౌలిక అంశాలు ప్రత్యేకాంశాలుగా ఉన్నాయి. ఈ మౌలికాంశాల ఆధారంగా, వాస్తు శాస్త్రం గృహ బలాన్ని విశదీకరిస్తుంది.

ఈ విధంగా వాస్తుశాస్త్రం, జ్యోతిష శాస్త్ర సహకారంతో ఒక ప్రత్యే కమైన గొప్ప నిర్మాణ శాస్త్రంగా రూపొందింది. సూర్య సంచారము ఖగోళ గ్రహ సంచార యోగాలు, భూభౌతిక ప్రాకృతిక పరిస్థితుల పరిశీలన మొదలగు అంశాలను మేళవించి, ఈ వాస్తుశాస్త్రానికి విశ్వకర్మ, మయబ్రహ్మ మొదలగు శిల్ప ఋషులు సృష్టికర్తలైనారు. కాబట్టి గృహబలం వేరు గ్రహబలం వేరు అనేవారి వాదన అసమంజసం. మరి కొందరు గృహబలం లేదు, గ్రహబలం లేదు, 'అంతామిధ్య జగత్సర్వం' అనే వారున్నారు. వారు మన బుద్ధి బలమే సమస్త సుఖ దుఃఖాలకు మూలకారణమని వాదిస్తున్నారు. ఈ శాస్త్రాలన్నీ పొట్టగడవని కొందరు బుద్ధి జీవుల పుక్కిటి పురాణాలని దుయ్యబడుతు న్నారు. కానీ, ఆవిధంగా చెప్పేవారిలో ఎందరు ఆ గ్రంథాలను పరిశీలించారు? కనీసం ఆయా గ్రంథాల పేర్లు కూడా వారెరుగరు. అట్టి వారికి ఒకటే మనవి. ఆయా గ్రంధాలను తిరస్కరించే ముందు వాటిలో ఏమి వివరింపబడి ఉందో పరిశీలించి చూడమని ప్రార్థన.

ఈ మూడు విధాలైన వాదాలను నిష్పక్షికంగా విమర్శ చేద్దాం. ఈ క్రింది విషయాలు గమనించండి. మనం నివసించే గోళం సూర్య కుటుంబానికి చెందినది. ఈ సూర్య కుటుంబంలో ఇంకా కుజుడు, బుధుడు, గురుడు శుక్రుడు, శని అనే తారా గ్రహాలు, రాహు, కేతువు అనే ఛాయా గ్రహాలు ఉన్నాయి. ఇంకా ఇంద్ర, వరుణ, యమ గ్రహాలున్నాయని, అన్నీ పరస్పరాకర్షణ వికర్షణ ప్రభావాలకు లోనై పరిభ్రమిస్తూ తమ తమ నియమిత కక్ష్యలలో సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఈ సమస్త గ్రహాలకూ సూర్యుని నుండే వెలుగు లభిస్తూ ఉంది. ఈ అన్ని గోళాల నుండి ప్రసారమయ్యే శక్తి తరంగాలు ప్రతి క్షణం భూగోళాన్ని తాకుతూ అందు నివశించే ప్రాణుల పై తమ ప్రభావాన్ని చూపుతున్నాయి.

ఈ నగ్న సత్యాన్ని ఎవ్వరూ కాదనలేరు గదా అటువంటప్పుడు మానవ జీవితం పై ఖగోళ గ్రహగతుల ప్రభావం లేదనడం ఏ విధంగా సమర్థనీయం.

జ్యోతిషం ఆధారంగా చెప్పే భూత, భవిష్యత్తు, వర్తమాన ఫలితాలు ఖచ్చితంగా జరుగుతాయి. అయితే ఆ ఫలితాలు; చెప్పేవారి శాస్త్రానుభవ పటిమ మీద జరుగుట, జరగక పోవుట అనే విషయం ఆధారపడి ఉంటుంది. అంతేగాని 'శాస్త్రం' సత్యమైనదే.

ఇక గృహబలాన్ని చెప్పే వాస్తుపండితుల గూర్చి పరిశీలిద్దాం. వాస్తు శాస్త్రంలో గ్రహబలం ఆధారంగానే సూత్రాలు చెప్పబడ్డాయి. ముఖ్యంగా గ్రహ రాజైన సూర్యుని గమనాన్ని అనుసరించి వాస్తు పదవిన్యాసం రూపొందింప బడింది.

ముఖ్యంగా మన భూగోళం ఏ సమయంలో శక్తివంతమై ఉంటుందో ఎప్పుడు శక్తిహీనమై ఉంటుందో వైజ్ఞానిక పద్ధతిలో గణించి చెప్పినదే 'సుప్త భూలక్షణం' అనే ప్రకరణం. సూర్యునకు భూమికి, భూమికి చంద్రునకు మధ్యగల దూరమును పరిశీలించి ఈ సూత్రము రూపొందిప బడినది.

సూర్యుడున్న నక్షత్రాన్నుండి 5-7-9-12-19-26 నక్షత్రముల యందు చంద్రుడున్న కాలంలో భూమిది నిద్రావస్థ అని వివరింపబడినది. ఆ సమ యంలో భూమి యొక్క శక్తి క్షీణావస్థయందు ఉంటుంది. కాబట్టి ఆ కాలము నందు వాస్తు నిర్మాణములు చేయరాదని నిషేధము విధించబడినది.

వాస్తు పద విన్యాసం అనే సూత్రంలో ఖగోళంలో సూర్య గమనాన్ని అనుసరించి, ఆయా ఖగోళ గ్రహ గతులను కుదించి, క్లుప్తీకరించి, వాస్తు పద విన్యాసం అనే మహత్తర ప్రణాళికను ఖగోళం మీద ఆవిష్కరించారు మన శిల్ప ఋషులు. మానవులు ఈ భూమండలం మీద నివశిస్తూ, అనంతమైన సౌర శక్తిని ఎంత పుష్కలంగా వినియోగించుకొనే అవకాశాలున్నాయో, అంత వరకు ఉపయోగించుకొనుటకు అవసరమైన ప్రణాళికయే ఈ వాస్తు పద విన్యాస యంత్రము. వాస్తు శాస్త్రానికి, జ్యోతిష శాస్త్రానికి గల సంబంధం తెలియడానికి ఈ రెండు ఉదాహరణలు చాలు.

కాబట్టి గ్రహబలం వేరు, గృహబలం వేరు అనేవారికి అరెండు బలాలు ఏవిధంగా ఏర్పడతాయో అవగాహన తక్కువ అనాలి గ్రహబలానికి గృహబలానికి అవినాభావ సంబంధం ఉంటుంది. ఈ రెండు శక్తుల పరస్పర సమ్మేళనమే మానవుని సుఖదుఃఖాలను నిర్ణయిస్తుంది. అయితే ఈ రెండు శక్తులను అధిగమించగల మరో శక్తి ఉంది. అదే మానవుని ఆత్మశక్తి అనే ఆధ్యాత్మిక శక్తి. అయితే అందరు అట్టి ఆత్మశక్తిని సంపాదించలేరుగదా.

మన వేద శాస్త్రాలలోని అనేక విషయాలకు ఈనాటి సైన్సు జవాబులు సాధించలేక పోతున్నదని ఋజువగుచున్నది అంతమాత్రం చేత ఈనాటి వైజ్ఞానిక సత్యాలను కాదనగలమా? ఆ విధంగానే మన ప్రాచీన శాస్త్రాలలోని వైజ్ఞానిక సత్యాలను కాదనరాదు ఉదాహరణకు మన ప్రాచీన కట్టడాలలోని వైజ్ఞానిక రహస్యాలు ఈనాటికి సైన్సునకు సవాలు గానే నిలచియున్నాయి. గోల్కొండ కోట యందలి ధ్వని గ్రహణ యంత్రం, ఢిల్లీ అక్బరు కోటలోని ధ్వని ప్రసార యంత్రాలు ఇందుకు ఉదాహరణ.

కాబట్టి గ్రహబలం చాలా శక్తివంతమైనదని మనం నమ్మి తీరాలి గృహబలం, గ్రహబలం కంటె వేరు కాదు. గృహబలానికి, గ్రహబలానికి పరస్పరాశ్రయం అవసరం గృహ శంకుస్థాపన లగాయతు, గృహ ప్రవేశ సమయం వరకు అంతాగ్రహబలం ఆధారంగా జరుగుతూ ఉంటుంది గదా గృహ నిర్మాణ శైలి కూడా గ్రహరాజైన సూర్య గమనాన్ని అనుసరిస్తుంది

ఇవి అన్నీ కూలంకషంగా పరిశీలిస్తే గృహ యజమాని యొక్క గ్రహబలం ఆధారంగానే గృహ స్వరూపం రూపొందుతుందని పిండితార్థం

మరో విషయం గమనించండి గృహ ప్రవేశ సమయంలో అష్ట దిక్పాలురకు, నవగ్రహములకు, వాస్తు పురుషునకు ఆవాహన ఎందుకు చేస్తాం? గృహక్షేత్రం, అష్టదిక్పాలురకు, నవగ్రహాలకు, వాస్తుపురుషుని శక్తికి ప్రతీకలు గదా కాబట్టి ఆయా దేవతామూర్తుల అనుగ్రహం కోసమే నవగ్రహారాధన చేయడం జ్యోతిషశాస్త్ర ప్రభావమే



# గృహబలాన్ని ఏ విధంగా పరిరక్షించుకోవాలి?

గ్రహబలం అంటే ఏమిటో వెనుకటి ప్రకరణంలో చాలా వరకు విశదీకరింపబడింది. గృహబలం ఇక్కడ విశదీకరింపబడుతుంది.

గృహం పంచ భూతాత్మకమైన స్వరూపం అని గతంలో వివరించబడింది పంచ భూతాలు అనగా భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అని కదా మనకు తెలుసు ప్రతి యిల్లు ఈ పంచ భూతాలకు చెందిన తత్వములతో రూపొందుతుంది అయితే, అన్ని యిండ్లలోను ఈ పంచ భూతాలకు చెందిన తత్వాలు సమపాళ్ళలో మేళవింపబడినవా? అయా నిర్మాణ శైలి, అయా క్షేత్రమునకుగల భౌతిక స్థితి, అయా నిర్మాణాలకు అధిపత్యం వహించిన స్థపతి, సిద్ధాంతి యొక్క మేధా సంపత్తి అనేవాటి మీద, అయా తత్వాల కూడిక అధారపడి వుంటుంది. కొన్ని యిండ్లకు వాయు తత్వం అధికమైతే కొన్ని యిండ్లకు అకాశతత్వం కావలిసిన దాని కంటే అధికమౌతుంది. మరి కొన్ని నిర్మాణాలకు పృధివీ తత్వ సంబంధిత పదార్థాలు ఆధిక్యత కలిగి ఉంటాయి. ఈ విధంగా అయా నిర్మాణాలు ఆయా తత్వ సమ్మేళనానికి అనుగుణంగా ఫలితాలనిస్తాయి

గృహ నిర్మాణక్షేత్రంలో ప్రాకారపరివేష్ఠితమైనక్షేత్రమంతా ఒక యూనిట్గా గ్రహింపబడి, ఈ పాంచభౌతిక తత్వాల విమర్శచేయబడుతుంది. ఇటుకలు, సున్నం, రాళ్ళు, కలప,మొదలైన వస్తుసముదాయం పృధివీ తత్వానికి చెందినవి. నుయ్యి, నీటి కుండీలు, కుళాయిలు, నీటి పారుదల యేర్పాట్లు మొదలైనవి జల తత్వానికి చెందినవి. వంట శాలలు, దేవస్థలాలు, మొదలైనవి అగ్ని తత్వానికి చెందినవి.

ద్వారములు, కిటికీలు గవాక్షాలు మొదలైన వాయు ప్రసార సాధనాలు వాయుతత్వానికి చెందినవి యింటికి, ప్రహరీ గోడకు మధ్య గల ఖాళీ ప్రదేశము, గర్భంలో గదుల విస్తారము, వరండాలు గది గోడల యెత్తు ఆకాశతత్వానికి చెందినవి.

ఈ విధంగా పంచ భూతాత్మకమైన ఇంటికి వాస్తుబలం ఏ విధంగా పరిరక్షించుకోవాలో ఈ క్రింద వివరింపబడుతున్నది. పంచ భూతములకు సంబంధించినతత్వాలు ఏయేమేరకుగృహనిర్మాణంలో చోటుచేసుకుంటాయో ఆయా మేరకు గృహ సంబంధమైన తాత్వికబలం ఇంటికి సమకూరుతుంది వాస్తు పద విన్యాస ప్రణాళిక ననుసరించి పై నుదహరించిన పాంచ భౌతిక తత్వాల కలయికతో రూపొందింపబడిన ఇల్లు సంపూర్ణ వాస్తు బల సమన్వితము గును. వాస్తు పద ప్రణాళికా విరుద్ధమైన నిర్మాణం నిర్వీర్యమగును. అనేక కష్ట నష్టాలను కలుగజేస్తుంది.

ఆరోగ్యవంతమైన సర్వశుభలక్షణసమన్వితమైన, సజీవ పూర్ణ పురుష స్వరూపానికి ప్రతీకగా గృహ పురుషస్వరూపం సమర్థుడైన స్థపతి చేత ఆవిష్కరింప బడుతుంది. ఆరోగ్యవంతుడైన పురుషుడు తన జీవితాన్ని యే విధంగా ఆనందమయం చేసుకొంటాడో, ఆ విధంగానే ఆరోగ్యవంతమైన గృహ పురుషుడు కూడ ఆ గృహంలో మసలే జనాలకు ఆయురారోగ్య సౌభాగ్యాలను అందించగలడు.

''సర్వేషు అంగేషు శిర ప్రధానం'' అన్న సూత్రాన్ని అనుసరించి మానవుని అన్ని అంగాలలోను శిరస్సు ప్రధానమైనది గదా! అవయవాలన్నీ ఆరోగ్యంగా ఉన్నా శిరస్సు అనే ముఖం లేనిదే యే అవయవం పని చేయలేదు. ఆ విధంగానే గృహ పురుషుని ముఖంగా భావింపబడే ముఖద్వారం ఆ పరిసరాలు కళ కళలాడుతూ చూడముచ్చటగా ఉండాలి యింటిలోని పరిస్థితి యిల్లాలి ముఖమే చెబుతుంది అనే సామెత ఆధారంగా యింటి ముఖద్వారం ఆ పరిసరం చూడగానే ఆ యింటి పరిస్థితులు అవగాహనకు వస్తాయి

ఇంటి ముఖద్వారమందు గల ఖాళీ స్థలము గృహ పురుషునికి ఊపిరి తిత్తులుగా శాస్త్రంచెపుతుంది. ఊపిరితిత్తులు వాయుతత్వానికి చెందినవికదా మానవ జీవితానికి ఊపిరితిత్తుల ప్రాముఖ్యత ఎట్టిదో గృహ పురుషుని జీవితానికి ఇంటి ముంగిలి అనగా, సింహద్వారము ముందు గల ఖాళీ ప్రదేశము అంత ముఖ్యమైనది. ముఖద్వారము ముందు వాకిలి లేకుండా ఎంత మాత్రము గృహ నిర్మాణము చేయరాదు అట్లు చేసినచో ఆ ఇంటియందు నివసించువారు శ్వాస రోగాలచే పీడింపబడుచుందురు. ఊపిరితిత్తులు చెడిపోయిన మనిషి వలె ఆ ఇల్లు తయారగును.

వాయుతత్వానికి చెందిన కిటికీలు, గవాక్షాలు, శాస్త్ర నియమాల ప్రకారం నియమించ బడనిచో ఆ ఇంటియందున్నవారికి వాయు సంబంధ రోగములు కలిగి అనారోగ్యములతోనూ మానసిక అశాంతితోనూ బాధపడు చుందురు.

ఆకాశతత్వానికి చెందిన ఇంటి చుట్టూరాగా గల ఖాళీ ప్రదేశాలు చక్కని గాలీ వెలుతురు ప్రసారం చేసే సాధనాలు. అయా ఖాళీ ప్రదేశాలలో ఎత్తైన చెట్లు పెంచరాదు. ఇంటికి తూర్పు ఉత్తరం, ఈశాన్య దిశలయందు రెండు మీటర్ల ఎత్తు కంటె ఎక్కువగా పెరిగే చెట్లను పెంచరాదు. సూర్య కిరణ ప్రసారమునకు అటంకము కారాదు. ఈ నియమాన్ని పాటింపనిచో ఆ ఇంటనుండే వారు ఎప్పుడూ రోగాల పాలవుతారు.

అవసరానికి అనుకూలమైన విధంగా గృహావరణలో ఎక్కడ బడితే అక్కడ ఉపగృహాలు నిర్మించరాదు. ఆ విధంగా నిర్మాణాలు చేస్తే అయా దిక్పతుల బలం తగ్గిపోతుంది. వాస్తుబలం తగ్గిపోయి అనేక కష్ట నష్టాలకు గురియగుదురు.

మా అనుభవంలో కూడా ఆ విధంగా నిర్మాణాలు చేపట్టిన చోట అనేక అనర్థాలు జరుగుతున్నట్లుగా గమనిస్తున్నాం.

పృథివీ తత్వానికి చెందిన కలప, ఇటుక, సున్నం వాణ్యమైనవి నిర్మాణంలో వినియోగించాలి. వాస్తు శాస్త్రాలు నిషేధించిన చెట్ల కలపను వినియోగించరాదు. ముందుగా మనం స్థపతి చేత నిర్ధారింపచేసికొని ప్లానునకు విరుద్ధంగా మన ఇష్టం వచ్చినట్లు గుమ్మాలు, కిటికీలు మార్చరాదు.

జలతత్వానికి చెందిన నూయి, కుళాయి, నీటి కుండీలు మొదలైనవి ఈశాన్యదిశయందే నిర్మించుట శ్రేయోదాయకము. మనము గృహ నిర్మాణ సమయాలలో ఈ పై నియమాలు పాటించినచో గృహబలాన్ని పెంపొందించు కొన్నవారమగుదుము.

## మరో ముఖ్య గమనిక :-

గృహ నిర్మాణానికి ప్రారంభంలో వాస్తు సిద్ధాంతి ఇచ్చిన గ్రౌండు ప్లానును యజమానుడు భద్రంగా దాచి ఉంచాలి. ఆ పత్రిక మంచి శుభ ఫలితాన్ని ఇస్తుందని శాస్త్ర వచనము.

# గృహనిర్మాణ విధులు

గృహ నిర్మాణ విధులలో ముఖ్యమైనది స్థల సేకరణ. ఈ స్థల సేకరణ సందర్భంలో అనేక విషయాలు పరిశీలించవలసి ఉంటుంది. అందులో ముఖ్యమైన విషయం పరిసరాల ప్రభావం. పరిసరాల ప్రభావం ఆయా నిర్మాణముల యందు నివశించే వారిపై అధికంగా ఉంటుంది!

స్థలం అనగా యేదయినా ఒక నిర్మాణ నిమిత్తం నాలుగు దిశలు, సమ సూత్రానికి సవరించి, సరిహద్దులు ఏర్పరచిన మొత్తం స్థలం దీనికే వాస్తువు అని పేరు. ఈ వాస్తువు యొక్క పరిసరాలు చూడగానే మనస్సునకు ఆహ్లాదం కలిగించేవిగా ఉండాలని వాస్తు శాస్త్రం స్పష్టం చేసింది. మనోహరమైన పరిసరాలుగల క్షేత్రం ఆనంద దాయకమై అష్టైశ్వర్యాలను ఇస్తుంది

గృహ నిర్మాణానికి సేకరించే స్థలం గ్రామానికి పొలిమేరలలో ఉండరాదు. జనం రద్దీగా ఉండే రచ్చబండలకు సమీపంలో గాని, గోపురాల నీడ పడే చోట గాని, గృహ నిర్మాణానికి పనికిరాదు శివాలయం ముందు గాని, విష్ణు ఆలయానికి వెనుక గాని, అమ్మవారి ఆలయములకు గ్రామ దేవతల ఆలయములకు పార్శ్వముల (రెండు ప్రక్కల) యందుగాని గృహ నిర్మాణము చేయరాదు

శ్మశాన భూములకు సమీపమునందు గృహ నిర్మాణము చేయరాదు. ఇది ముఖ్యంగా ఆరోగ్య సంబంధమైన నియమము. శ్మశాన భూములయందలి గాలి సర్వదా కలుషితమై ఉంటుంది. అట్టి గాలి పీల్చిన వారు రోగగ్రస్తులగుట తథ్యం. కాబట్టి శ్మశాన భూముల యందు గాని పరిసరాలయందు గాని, గృహ నిర్మాణం చేయరాదు. శ్మశాన భూమి నుండి వెలువడే పొగ పీల్చిన ఆయుక్షీణమని శాస్త్రవచనము.

స్థల సేకరణలో వేధా దోషాలు కూడా ఒక భాగం గృహ నిర్మాణ క్షేత్రం రాజ వీధులకు ఎదురుగా ఉండరాదు చిన్న సందులకు ఎదురుగానున్నచో ఆ

భాగమును విడచి గృహ నిర్మాణం చేయవచ్చును. కానీ స్థలానికి పెద్ద వీధి ఎదురుగాయున్నచో, ఆ వీధిశూల పొరు విడచి ప్రాకారము నిర్మించుకొని, అందు గృహ నిర్మాణము చేయవలెను. రెండు వీధులు చెరియొక దిశకు విడి పోవు మూలయందు అనగా y జంక్షనునందు




గృహ నిర్మాణము చేయరాదు. ఈ స్థలము సర్వారిష్ట దాయకమైనది. ఎట్టి పరిస్థితులలోను త్రికోణాకారపు స్థలమును గృహ నిర్మాణమునకై స్వీకరిం పరాదు.

స్థలమునందలి నీటిపారుదలలు తూర్పు ఉత్తర దిశలకు ఉండే విధంగా స్థలమును సవరించు కొనవలెను. స్థలమునకు తూర్పు ఉత్తర దిశలయందు వీధులు లేని స్థలములయందు నీటి పారుదల నిమిత్తము కొంత భూమిని విడచిపెట్టి ప్రాకారమును నిర్మించుకొనవలెను. అట్టిస్థితిలో ప్రాకారపు ఈశాన్య భాగము నుండి మనము విడచిపెట్టిన తూర్పు స్థలములోనికి గానీ, ఉత్తరపు సందు లోనికి గానీ, నీరు ప్రవహించి తరువాత యధేచ్ఛగా పోవచ్చును.

ఈ విధంగా స్థల సేకరణ జరిగిన పిమ్మట ఆ స్థలమును మిట్ట పల్లములు లేకుండా చదును చేసి కొంచెముగా తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశలు పల్లముగా నుండునట్లు సరిచేయవలెను. ఆ పిమ్మట ఒక శుభ దినమున దిశలు సవరించి స్థలమును సమచతురముగా గాని, ఆయతముగా గాని, సరిహద్దులు ఏర్పరచవలెను.

గృహ నిర్మాణ స్థలము సమచతురముగా గాని దీర్ఘ చతురముగా గాని ఉండవలెను. ఈ రెండు విధములైన స్థలములు మాత్రమే శుభ ప్రదమైనవని మయుడు స్పష్టపరచి యున్నాడు. కావున గృహ నిర్మాణ క్షేత్రమును సమసూత్రమునకు నాలుగు దిశలను సవరించుటలో ఈ క్రింది నియమమును పాటించవలెను.

స్వీకరించిన స్థలమును సమతలముగా చేసిన పిమ్మట, ఆ స్థలమునకు తూర్పు సరిహద్దు రేఖవద్ద ఉత్తర దక్షిణములకు దిక్సూచి సహాయముతో సమ సూత్రమును సారించవలెను. ఇక్కడ సమ సూత్రము అనగా నూలుదారము గాని పురికొస గాని ఉపయోగింప వచ్చును. ఈ విధంగా సరిచేసిన సూత్రము నకు ఉత్తరపు కొసను ఒక గూటమ్ము దక్షిణపు కొసను మరొక గూటము పాతవలెను. ఆ విధంగా పాతిన దక్షిణ కొసను గల గూటము వద్ద, స్థలమునకు దక్షిణపు సరిహద్దు గుండా సూత్రమును సారించి ఆగ్నేయమూల యందు మూలమట్టమునకు సరిచేయ వలెను. అట్లు సరి చేయగా యేర్పడిన దక్షిణ సూత్రమునకు పశ్చిమ కొసను అనగా, స్థలమునకు నైఋతి దిశను ఒక బలిష్ఠ మగు కొయ్యను పాతి సూత్రము బిగించవలెను. ఆ పిమ్మట నైఋతి మూల గల కొయ్య వద్ద మూలమట్టమునకు దక్షిణ సూత్రమును సవరించి, ఆ సూత్రము నకు సరిగా స్థలమునకు పడమర సరిహద్దు మీదుగా సూత్రమును లాగి, వాయువ్య మూల కొయ్యను పాతవలెను. అపుడు స్థలమునకు తూర్పు దక్షిణ, పశ్చిమ సరిహద్దులు సరి చేయబడినది. నైఋతి మూల 90 డిగ్రీలుగా మూల మట్టమునకు సరిచేయబడినవి. ఆ పిమ్మట స్థలమునకు ఉత్తర సరిహద్దు మీదుగా, ఈశాన్య కోణమునందు వాయువ్య కోణమునందు గల కొయ్యలకు సూత్రమును పట్టి రెండు మూలల యందు మూలమట్టమునకు సరిచేయవలెను ఇప్పటికి గృహ నిర్మాణ స్థలము నాలుగు మూలల యందు మూలమట్ట మునకు సరిచేయబడి నాలుగు దిశలు సమానముగా 'శుద్ధప్రాచీ' అను పేరు గల క్షేత్రము సిద్ధించినది



## ఈశ ప్రాచీ

ముందుప్రకరణమున 'శుద్ధప్రాచీ' అను క్షేత్రమును గురించి చదివితిమి గదా నాలుగు దిశలు సమ సూత్రమునకు గల క్షేత్రము 'శుద్ధప్రాచీ' అనబడును. ఇట్టి స్థలములో ఇల్లు కట్టి నివసించు వారికి ఇష్టార్థసిద్ధి కలుగునని శాస్త్ర వచనము.

ప్రాచీన శిల్ప ఋషులలో మానసార మహర్షి చాలా ప్రసిద్ధుడు అతడు తన మానసారమునందే ''ఈశప్రాచీ'' అనే స్థల విశేషము గురించి ఈ క్రింది సూత్రాన్ని వివరించారు.

'ఐశాన్య ప్రాచీ సర్వస్య భోగ కామస్య సమ్మతా'

(మానసారం 17 పే)

అనగా ఈశాన్యప్రాచీ అనే స్థలంలో ఇల్లు కట్టి నివసించేవారు అష్టైశ్వర్యాలు అనుభవిస్తారు అని భావము. కాబట్టి గృహ నిర్మాణ విషయమై స్థల నిర్ధారణలో ఈ ఈశప్రాచీ అనే క్షేత్రం గురించి తగు జాగ్రత్తలు తీసుకోవాలి. యేమాత్రం ఈశాన్య భాగం లోపించినా అందు గృహ నిర్మాణం చేయరాదు. ఈశాన్య లోపం ముందుగా సవరించినపిమ్మటనేఅందుగృహ నిర్మాణ ప్రయత్నం చేయాలి. ఈ విషయం యెంత మాత్రం రాజీపడరాదు. అయితే ఈ ఈశప్రాచీ క్షేత్రాన్ని యేవిధంగా రూపొందించాలి అనే విషయం కూడ మానసారముని స్పష్టపరచియున్నాడు.

ప్రాచ్యాం గుళకృతాద్భిందో: ఉత్తరేచాంగుళంన్యశేత్

ప్రతీచీమాత్ర తద్భిందో: ఈశప్రాచీం ప్రసూత్రయేత్

అనగా నాలుగు దిశలు సమముగా గల 'శుద్ధప్రాచీ' అనే సమ చతురశ్ర క్షేత్రానికి గాని, దీర్ఘచతురశ్ర క్షేత్రానికి గాని, ఈశాన్య కోణముగల కొయ్యను తూర్పు దిశగా ఒక అంగుళము, ఉత్తర దిశగా ఒక అంగుళము జరిపి, కొయ్యను పాతి ఆ కొయ్యకు సూత్రమును కట్టగా, స్థలమునందు ఉత్తరము తూర్పు దిశల యందు ఈశాన్యభాగము పెరుగుదల కనునించును ఆ పెరుగుదల చేతనే 'ఈశప్రాచీ' అనే పేరు ఆ క్షేత్రమునకు కలిగినది. అట్టి ఈశప్రాచీ క్షేత్రమునే గృహ నిర్మాణమునకు వినియోగించుట మిక్కిలి శ్రేష్టముగా భావించ బడుచున్నది. మరొక శాస్త్ర వచనము గమనింపుడు.

మాషమాత్రం తు మీశాన్యం పుత్రదారాదిలాభకృత్




అనగా మినప గింజంత ప్రమాణము గల ఈశాన్య భూమి పెరుగుదల తూర్పు దిక్కుయందు గలిగియున్న యెడల అట్టి క్షేత్రము పుత్రులు సర్వ సంపదలు యిచ్చునని అర్థము. కాబట్టి యేవిధంగా జూచినా ఈశప్రాచీ క్షేత్రము అనగా, ఈశాన్య దిశ ముఖ్యముగా తూర్పు వైపునకు పెరుగుదల గల భూమి అష్టైశ్వర్యములను యిచ్చునని గ్రహించవలయును.

ఈ సందర్భములో గమనించవలసిన ముఖ్య విషయం ఉంది స్థలము యొక్క ఆగ్నేయ భాగం తూర్పు దిశగా గాని దక్షిణ దిశగా గాని యేమాత్రం పెరుగుదల ఉండరాదు. అట్టి క్షేత్రములో గృహ నిర్మాణమునకు శంకుస్థాపన చేయరాదు.

'ఆగ్నేయప్రాచీసంయుక్తం సర్వ దోషకరం భవేత్'

అనగా క్షేత్రము యొక్క ఆగ్నేయ దిశయందు, తూర్పు దిశగా యేమాత్రం పెరుగుదల కలిగియున్నను సమస్త దోషములు ఆవహించునని అర్థము. అంతేగాదు

'వ్రీహి మాత్రంతు ఆగ్నేయం సర్వ గ్రహభయం తథా,
దేహరోగో, విత్తనాశో, బంధుహానిర్భవిష్యతి '

అని చెప్పబడినది. అనగా వడ్ల గింజంత మాత్రమైన ఆగ్నేయ దిశ యందు పెరిగిన తూర్పు భాగము గ్రహ భయము, రోగ భయము ధన నాశనము, బంధుహాని కలుగజేయునని చెప్పబడినది. కాబట్టి బుద్ధిమంతుడైన వాస్తు పండితుడు ఈ విధమైన ఆగ్నేయ దిశ పెరుగుదలను అంగీకరింపకుండు రుగాక యని విజ్ఞప్తి.



## దిశ యింటికి మాత్రమేనా? ప్రహరీగోడలకుకూడ వర్తిస్తుందా?

ఏదయినా నిర్మాణం నిమిత్తం స్వీకరించిన భూమికి, నాలుగు దిశల యందు ప్రాకారం నిర్మించగా, ఆ ప్రాకార పరివేష్ఠితమైన స్థలానికి 'వాస్తువు' అని పేరు. ఈ విషయం వెనుకటి ప్రకరణాల్లో స్పష్టం చేయబడినది. గృహ నిర్మాణ స్థలం యొక్క నాలుగు దిశలు సరిగా ఉండి నాలుగు మూలల యందు మూల మట్టమునకు సరిచేయబడి వుండాలి. నాలుగు మూలల యందు 90 డిగ్రీలకు సరిగా ఉండాలి లేదా 'ఈశప్రాచీ' అయినా అయి వుండాలి. అట్టిస్థలంలో మనం గృహ నిర్మాణం కొనసాగించి నివశించుట మిక్కిలి శుభప్రదంగా ఉంటుంది.

కాని, కొంత మంది యిల్లు మాత్రం దిశకు సరిగా దిక్సూచిని అనుస నించి నిర్మించి, ప్రాకారం, స్థలం ఏ విధంగా ఉన్నా ఆ విధంగా నిర్మించుకోవచ్చుని చెబుతున్నారు. ఈ పద్ధతి పూర్తిగా శాస్త్ర విరుద్ధమైన పద్ధతి. దీని వలన చెడు ఫలితాలే కలుగుతాయి చూడటానికి కూడ అందంగా కన్పించదు. సామా న్యంగా నూటికి తొంభై చోట్ల స్థలాలు దిశలకు సరిగా ఉండవు. మనం ఆయా స్థలాలను దిక్సూచికి సరిజేసి, హెచ్చు తగ్గులు సరిజేసి, కోసులు విడిచిపెట్టి, సరిహద్దుగట్లుగాని, ప్రహరీగోడలుగాని నిర్మించుకోవడం ఉత్తమమైనపద్ధతి. స్థలము తక్కువ అవుతుందని గాని కోసు స్థలం బయటకు పోతుందని కాని లోభగుణంతో స్థలం వంకర టింకరులుగా ఉన్నా, ఆ విధంగానే ప్రాకారం గోడలు నిర్మింపరాదు ఈ విధంగా చేయడం మహాదోషం.

'దిఙ్మూఢే కుల నాశశ్యాత్ వక్రేదారిద్ర్యమాదిశేత్'

అనగా దిశసరిగా లేని యిల్లు వంశనాశనం చేస్తుందని శాస్త్ర ప్రమాణం. ప్రాకారము వంకరటింకరులుగా ఉంటే దరిద్రాన్ని కలుగజేస్తుంది. కాబట్టి, బుద్ధిమంతులైనవారు ప్రాకారము వంకరటింకరులుగా నిర్మింపరాదు. కోసులు

గల స్థలమునందు సరిహద్దులు దిశలకు సరిజేసి, కోసులు బయటకు విడిచి పెట్టి సమసూత్రంగా ప్రాకారాదులు నిర్మింపవలెను.

## వీధిననుసరించి యిల్లుకట్టాలి :

గమనించవలసిన మరొక ముఖ్య విషయమేమనగా కొన్ని కొన్ని చోట్ల గ్రామాల్లోను, నగరాల్లోను, నివేశన స్థలాలు దిశలకు సరిగా తీర్చబడియుండవు. వీధులు దిశలకు తీర్చబడి ఉండని చోట స్థలాలు కూడా దిశలకు అనుకూలంగా లభించవు. ఆ విధమైన స్థలాలలో వీధిననుసరించి పరిసరాల యిండ్ల పారుల ననుసరించి మాత్రమే యిండ్లు నిర్మించాలి అంతే కాని తన ఒక్క యిల్లు మాత్రం దిశలకు సరిజేసి నిర్మించాలని, మూర్ఖంగా ప్రక్క యిండ్ల పారులు వదలిపెట్టి ''పంక్తిశోభ'' విచారించకయే, గృహ నిర్మాణం చేయరాదని విశ్వకర్మ తన వాస్తు శాస్త్రంలో స్పష్టపరచియున్నాడు

కాబట్టి, దిశలకు సరిగా అమరని స్థలాలలో పంక్తిశోభచెడకుండా స్థలం యొక్క నాలుగు మూలలు మూలమలట్టానికి సవరించి, ఆ పిమ్మట నాలుగు వైపుల తగినంత ఖాళీ ప్రదేశం విడిచిపెట్టి గృహ నిర్మాణం చేపట్టాలి. పంక్తిశోభ అనగా ఆ వీధిలో యిండ్ల యొక్క వెన్నువాసం తూర్పు పడమరలుగా ఉన్నచో, మనం నిర్మించే యింటికి కూడ వెన్ను తూర్పు పడమరలుగానే వుండాలి. ఆ వీధిలో యిండ్లు ఉత్తర దక్షిణాలకు వెన్ను కలిగి ఉంటే, మన నిర్మాణం కూడా అటే వుండాలి. డాబా యిండ్ల కయితే పారులు సరిచేసుకొని కర్తకు తగిన ముఖద్వారం నిర్మించుకో వచ్చును.



# శాలా నిర్మాణ పద్ధతి

ఈ చరా చర జగత్తంతా శబ్దమయం. ప్రణవ స్వరూపమైన ఆ శబ్దం, ఆది పరాశక్తి స్వరూపమే. కాలక్రమంలో ఆ శబ్దం మాత్రాబద్ధమై గురు లఘు రూపాత్మకమైన వర్గాక్షర సమామ్నాయంగా రూపాంతరం చెందింది. సమస్త విజ్ఞాన వికాసానికి ఈ వర్గాక్షర సమామ్నాయం ఆధారభూతమై, సంగీత, సాహిత్యాది కళలకు జన్మనిచ్చింది.

ధర్మార్థకామ మోక్షాలను చతుర్విధ పురుషార్థాల సాధనకు, గృహమే ఆధారంగా నిలిచి మానవ జీవితంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అట్టి గృహ నిర్మాణం కూడ, సంగీత సాహిత్యాల వలె, గురు లఘు, ప్రస్తార క్రమంలో విశ్వకర్మాది శిల్ప ఋషుల చేత శాసింపబడింది.

ఈ గృహ నిర్మాణ క్రమంలో గురువు అనగా గోడ, లఘువు అనగా ద్వారం. ద్వారం ఉన్నచోట వరండా అనే అలిందం నిర్మాణం తప్పనిసరి. ఈ గురులఘు రూపాత్మకమైన ప్రస్తార క్రమంలో మొదటిది, నాలుగు గురువుల ప్రస్తారం. ఈ నాలుగు గురువుల ప్రస్తారంలో షోడశ గృహాలు అనగా 16 యేక శాలలు యేర్పడతాయి. ఈ నాలుగు గురువుల ప్రస్తార క్రమంలో

| | | |
|---|---|---|
| 1వది | ''ఆద్య'' | తూర్పు దిశకు గుర్తు |
| 2వది | ''ద్వితీయ'' | దక్షిణ దిశకు గుర్తు |
| 3వది | ''తృతీయ'' | పడమర దిశకు గుర్తు |
| 4వది | ''చతుర్థ'' | ఉత్తర దిశకు గుర్తు |

ఈ ధాన్యాది షోడశ గృహప్రస్తారం, గృహనిర్మాణానికి మూలకందం. సమస్త వాస్తు శాస్త్రాలలోను యేమాత్రం మత భేదం లేకుండా ఈ శాలా నిర్మాణ పద్ధతి వివరింపబడింది. కాని ఆధునిక కాలంలో ఈ నిర్మాణ పద్ధతిని అనుసరించే వారెందరు? ఆధునిక యింజనీర్లు మన ప్రాచీన గృహ నిర్మాణ పద్ధతిని పూర్తిగా విస్మరిస్తున్నారు.

ప్రతి యింటికి రెండు ముఖ్య భాగాలు ఉంటాయి. మొదటిది శాలా భాగము అనగా గర్భం. రెండవ భాగం అలిందం. అనగా వసారా భాగం. ఈ అలింద సంయోజన వైవిధ్యం చేత 105 రకముల ఏక శాలలు యేర్పడుతు న్నాయి. ఈ ఏకశాలనే మయబ్రహ్మ ''దండకం ' అని కూడ వ్యవహరించియు న్నాడు.

'ఏకశాల అనగా ఒకే పైకప్పు యొక్క అవరణ క్రిందిగల 'శాల అనగా యిల్లు అని తెలుస్తువుంది.

ఏకశాలకమేకేన ఛన్నేన గృహముచ్చరేత్
గృహమేకంతు యచ్ఛన్నం:సర్వం శాలేతి సాస్మృతా:

అనగా ఒకే కప్పు క్రింద గాని లేదా ఆధునికమైన శ్లాబు అనే ఆ అవరణ క్రింద గాని ఉన్న యిల్లు, ఏక శాలయని భావం. ఈనాటి గృహ నిర్మాణ శైలి ననుసరించి ఒకే శ్లాబు క్రింద గల యెంతటి విశాలమైన యిల్లు అయినను ఏక శాలగానే పరిగణింపబడుతుంది ఈ ఏక శాలా నిర్మాణ శైలిలో వరండాల చేరికతో కొన్ని యిండ్ల నమూనాలు ఈ క్రింది విధంగా మానసారము', మయమతము', 'విశ్వకర్మ ప్రకాశిక' అను గ్రంథములలో వర్ణింపబడిన రీతిలో వివరిస్తున్నాం. యివి యెవ్వరి స్వకపోల కల్పితాలు కావు. నిర్మాణశైలి మాత్రము ఆధునికం చేయబడినది.

ఏకశాలలు 4 గురువుల ప్రస్తారక్రమంలో ధాన్యాది షోడశ గృహాలు అనగా, 16 రకములైన యిండ్లు యేర్పడినా, ప్రస్తుతం వాడుకలోవున్న కొన్ని యిండ్లు మాత్రం యిక్కడ వివరింపబడుతున్నాయి.

అయితే వర్గారూఢముననుసరించి యింటికి యేయే దిశలలో యెంతెంత ఖాళీ స్థలము విడిచిపెట్టవలసి వుంటుందో సిద్ధాంతి జాగ్రత్తగా పరిశీలించాలి. శత్రువర్గ స్థానం విడిచిపెట్టవలసివుంటుంది స్వవర్గునకు 5వ స్థానం శత్రువర్గ మని యిదివరలో విశదీకరింపబడింది. కాబట్టి ఈ శాలా నిర్మాణంలో పండితు

లైనవారు ఆయా యోగ్యమైన వర్గారూఢమునకు తగిన, రాశి యోగ్యమైన, క్షేత్ర యోగ్యమైన ముఖద్వారమును నిర్మించుకోవాలి. ముఖద్వార నిర్ణయమే యింటికి ప్రాణప్రదమైన నిర్ణయం.

## 1. ధాన్యశాల :

ఈ ధాన్యశాల షోడశగృహములలో రెండవది. గృహ నిర్మాణ క్షేత్రంలో ఏకాశీతి పదవాస్తువిన్యాస పద్ధతి ననుసరించి, బాహ్య పదముల వరస అన్గా, ప్రహారీ గోడ లోపలి తట్టున పిశాచ భాగం విడచి, తరువాత గృహ నిర్మాణం చేయవలెను

పడమటి గోడను చేర్చి, గదులను నిర్మించి, తూర్పు దిశయందు మాత్రమే వరండా ఏర్పరచి, గదులలో నుండి వసారాల లోనికి గుమ్మాలు పెట్టి నిర్మించే ఇల్లు ధాన్యశాలయనబడును. ఈ ఇంటికి దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలయందు కిటికీలు మాత్రము నిర్మించు కొనవలెను. ఈ ధాన్యశాలకు వృషభాయ పదము శ్రేష్టము. ధ్వజాయ పదముతో కూడ గ్రహించవచ్చును.



**2. రమ్య శాల :**

ఈ రమ్యశాల అయిదు గురువుల ప్రస్తారానికి చెందినది ధాన్య శాలకు తూర్పు దిక్కునగల మొదటి వరండా తరువాత, మరియొక వరండా అదే ప్రమాణంతో నిర్మించినచో ఆ యింటికి రమ్యశాల యని పేరు. ఈ రమ్యశాల అష్టైశ్వర్యములను ప్రసాదించు నిర్మాణమని ఋషుల అభిప్రాయము. స్థపతి యొక్క నిర్మాణ శైలినసరించి గదులు ఏర్పరచ వలెను. ఈ రమ్యశాలకు కూడ వృషభ, ధ్వజాయ పదములే గ్రహింపవలెను




**3. కాంతశాల :**

షోడశ గృహ నిర్మాణ క్రమంలో ఆరవది కాంతశాల. ఈ కాంతశాల లోకంలో మిక్కిలి వాడుకలో ఉన్న ఇల్లు. కాంతశాల అనగా తూర్పు దిశ యందు గాని, పడమర దిశయందు గాని, ముఖద్వారముంచి, తూర్పు దిశ యందు వరండా, పడమర దిశయందు వరండా కలిగి ఆ వరండాలలోనికి గదుల నుండి తూర్పు, పడమరలకు గుమ్మాలు ఉంచి నిర్మించిన ఇల్లు ఈ కాంతశాలకు గర్భ గృహంలో రెండు గదులు గాని మూడు గదులు గాని నిర్మిం

చవచ్చును. మధ్య గదిని రంగము (హాలు) గా రూపొందింపవలెను: కోణముల యందు కోణ గృహములు అనగా, వసారాలలో గదులను రూపకల్పన చేయవచ్చును. ఉత్తర దక్షిణ దిశలకు గుమ్మములు పెట్టరాదు. కిటికీలు మాత్రము ఏర్పరచవచ్చును.

ఆధునిక నిర్మాణ శైలిననుసరించి అటాచ్డ్ లేవట్రీ, బాత్‌రూమ్‌లు కావలసినవారు, నైఋతి వాయువ్య దిశలయందలి కోనగృహములలో ఏర్పరచుకొనుట శుభప్రదము ఈ కాంతశాలకు వెనుబద్ద, దక్షిణోత్తరదిశలను సూచించు చుండును.

ఈ కాంతశాలకు తూర్పుముఖ ద్వారముంచినచో ధ్వజాయ పదము గాని, వృషభాయ, గజాయ పదములు గాని స్వీకరింపవచ్చును. పడమటి ముఖ ద్వారముంచినచో ధ్వజాయ పదమును మాత్రమే వినియోగించవలెను.



**4.ముదిత శాల :**

పై కాంత శాలకు, తూర్పు ముఖద్వారము నిర్మించినపుడు ముఖ ద్వార మునచిన తూర్పు దిశయందలి మొదటి వరండా, తరువాత మరియొక వరండా నిర్మించిన యెడల, అట్టి ఇంటికి ''ముదితము' అని పేరు ఐదు గురువుల ప్రస్తార క్రమంలో ఈ ఇల్లు మిక్కిలి శుభప్రదమైనది. నిర్మాణ శైలి ననుసరించి వరండాలయందు కూడ గదులను నిర్మించుకొనవచ్చును. తూర్పునగల రెండవ వరండాకు ''ముఖాళిందము'' అనిపేరు.



## 5. ఉత్తమశాల :

పైకాంతశాల ఏముఖ ద్వారముగా నిర్మించినను, తూర్పుదిశయందు రెండు వరండాలు, పడమర దిశయందు రెండు వరండాలు నిర్మించినచో, అట్టి నిర్మాణానికి ఉత్తమశాలయని పేరు. సర్వోత్తమమైన నిర్మాణము. వరండాల యంధు కూడా గదులు నిర్మించుకొన వచ్చును. ఆధునిక శ్లాబు నిర్మాణము నకు మిక్కిలి యోగ్యమైన నిర్మాణ విశేషము.



**6. సుపక్ష శాల :**

నాలుగు గురువుల ప్రస్తార క్రమంలో యేర్పడిన 16 ఏకశాలలలో ఇది 11వ శాల. ఈ సుపక్ష శాల కూడ మిక్కిలి వాడుకలోనున్న నిర్మాణం ఈ ఇంటికి వెనుబద్ద తూర్పు పడమరలను సూచించు చుండును. గుమ్మములు దక్షిణోత్తర దిశలకు అభిముఖముగా నుండును. ఉత్తరమున ఒక వరండా, దక్షిణమున ఒక వరండా నిర్మింప బడును. కోణములందు గదులు నిర్మించు కొన వచ్చును. తూర్పు పడమరలయందు అనగా, చిప్పతట్టులయందు కిటికీలు పెట్టు కొనవచ్చును. ఈ సుపక్ష శాలకు దక్షిణమున ముఖ ద్వార ముంచినచో గజాయముగల పదముగాని, ధ్వజాయముగల పదముగాని గ్రహించవలెను. ఉత్తర ముఖ ద్వారముంచినచో, సింహాయము లేదా ధ్వజాయముగల పదము గాని గ్రహించాలి.

**7. సౌభాగ్యశాల :**

పైనుదహరించిన కాంతశాలకు గాని, సుపక్షశాలకు గాని, ముందు వెనుకలయందు రెండేసి వరండాలు నిర్మించిన యెడల, అట్టి ఇంటికి సౌభాగ్యమని పేరు.

యస్యస్యాతా మలిందౌద్వావగ్రతః పృష్ఠత స్తథా
ధనధాన్య మవాప్నోతి సౌభాగ్యంచాపి తత్ గృహం
సమరాంగణం-113పేజీ

అనగా, ఏ ముఖద్వారముగల ఇంటికైననూ ముందు వెనుకలయందు రెండేసివరండాలు సంయోజ పరచి నిర్మించిన ఇంటికి సౌభాగ్యమని పేరు. ఈ 'సౌభాగ్యము' అను ఇల్లు సిరిసంపదలనిచ్చి జయము కలిగించును. వరండా భాగములను కలిపి వైశాల్యముగల గదులను నిర్మించుకొనవచ్చును. ఆయా సిద్దాంతులు అవలంబించే శైలి ననుసరించి రెండు వరండా భాగములను కలిపి

గాని, గర్భము, వరండా భాగములను కలిపిగాని, విశాలమగు హాలు కల్పించుకొనవచ్చును. ఆధునికగృహ నిర్మాణశైలిననుసరించి వరండాలనే అళింద భాగము లయందు లేవట్రీలు, స్నానపు గదుల అమరిక చేయవచ్చును. ఈ నిర్మాణ విధానమంతా స్థపతి అనుసరించే శైలిని బట్టి ఉంటుంది.




## 8. ధనద శాల :

నాలుగు గురువుల ప్రస్తారము ననుసరించి ఏర్పడిన షోడశ గృహాలలో ఈ ధనదశాల 12 వది. గృహ నిర్మాణ క్షేత్రంలో పడమటి సరిహద్దు రేఖ నుండి స్థలానుగుణ్యమైన పిశాచ భాగమును విడిచి పెట్టి, అనగా పడమర ప్రహరీ గోడకు లోపల కొంత ఖాళీ స్థలము విడచిపెట్టి, గృహ నిర్మాణము చేయవల యును.

పడమర గోడకు చేర్చి, గర్భ గృహము నిర్మించి, ఆ గర్భ గృహమునకు తూర్పు, దక్షిణ, ఉత్తర దిశలయందు వరండాలు ఏర్పరచవలయును. గర్భము నుండి మూడు దిశల వరండాల లోనికి ద్వారములుంచవలయును. పడమర దిశకు మాత్రము గుమ్మము లుండరాదు. కిటికీలు మాత్రమే నిర్మించవలెను. ఇట్టి నిర్మాణమునకు ధనదశాలయని పేరు. వరండాలలో శైలీభేదమునను సరించి గదులు నిర్మించుకొనవచ్చును. ఈ ఇంటికి వృషభాయముగల పదము గాని, ధ్వజాయ పదముగాని గ్రహింపవలెను. ఈ ఇల్లు ఛందోబద్ధమగు నిర్మాణ మగుటచేత ''ముప్పంచ'' అనే దోషము దీనికి వర్తించదు. త,య .శ వర్గుల వారికి మిక్కిలి శ్రేష్టమైనది.




## 9. సునాభశాల :

పైన వివరించిన ధనదశాలకు తూర్పుదిశయందు మాత్రము ముఖాళిందము అనగా, రెండవ వరండా నిర్మించిన యెడల అది సునాభమగును. ఇదియు శ్రేష్టమైన నిర్మాణ విశేషమే

## 10. విజయశాల :

ఛందోబద్ధమైన నాలుగు గురువుల ప్రస్తార క్రమంలో ఈ విజయశాల 16 వ ఇల్లు. నాలుగు దిశలయందు వరండాలు గల ఇంటికి ''విజయము'' అని పేరు వర్తించును. ''చుట్టూ వసారాల ఇల్లు'' అని ఆంధ్ర దేశంలో పేరెన్నిక గన్నది. గృహయజమానిని వర్గారూఢము ననుసరించిగాని, నాలుగు దిశల యందు ఏ ముఖద్వారమైనా ఏర్పరచుకొనవచ్చును. నాలుగు కోణములయందు మూలగదులు నిర్మింపవచ్చును. గర్భగృహమునుండి నాలుగు దిశలయందుగల వరండాలలోనికి ద్వారములు ఉండవలెను. వెనుబద్ధ ముఖద్వారమునను సరించి దక్షిణోత్తరములకు గాని, తూర్పు పడమరలకు గాని నిర్మింప వచ్చును. ఈ విజయ శాలకు నాలుగు దిశలయందు వర్గారూఢము ననుసరించి ఇంటికి తగిన విధంగా ఖాళీ స్థలము విడచి పెట్టి గృహ నిర్మాణము చేయవలెను. ఈ గృహమునే ''సర్వతోభద్రము'' అని వాస్తు పండితులందురు. పుత్ర పౌత్రాభివృద్ధిని కలుగజేయు నిర్మాణవిశేషము.



# ద్విశాలా నిర్మాణక్రమవిధులు

ద్విశాలయనగా రెండు గర్భములుగల ఇల్లు. ఈ రెండు గర్భములు రెండు దిశలనాక్రమించి ఉంటాయి. ఈ ద్విశాలనే ఆధునికులు L మోడల్ బిల్డింగ్ అని అంటారు. ఈ ద్విశాల, నైఋతి మూలను ఆక్రమించి పడమర వాయువ్యములకు చేర్చి ఒక గర్భము, దక్షిణ ఆగ్నేయ దిశలను కలిపి దక్షిణ గోడను చేర్చి ఒక గర్భము కలిగి ఉంటాయి. ఈ విధమైన ద్విశాలకు దక్షిణ పశ్చిమ దిశలకు కిటికీలు మాత్రమే ఉండాలి. గుమ్మాలు పెట్టకూడదు. ఈవిధమైన నిర్మాణానికి శ్రీకృష్ణ వాస్తునందు ''కమలాకరము'' అని పేరు. సమస్త సుఖములను ప్రసాదింపగలదు. విశ్వకర్మ ప్రకాశిక అను ప్రాచీన గ్రంధమునందు ఈ విధమైన ద్విశాలకు సిద్ధార్థము అని పేరున్నది సర్వార్థ సిద్ధిని కలుగజేయును.

ఈ విధమైన ద్విశాలా నిర్మాణమునందు ఈ క్రింది పద్ధతిని జాగ్రత్తగా గమనించవలెను ''అపరాజిత పృచ్ఛ ' అను గ్రంధమునందీ విధముగ వర్ణింపబడినది ద్విశాలా నిర్మాణానికి ఈ పద్ధతియే ఉత్తమమైన ప్రాతిపదిక.

చతురస్రం సమంకృత్వా త్రిపుటే నవకోష్టకం
మధ్య కోష్ట పదం త్యక్త్వా శాలాయుగ్మే ప్రతిష్టితః

పై ప్రమాణముననుసరించి గృహ నిర్మాణమునకు సేకరించిన స్థలమును 9 సమ భాగములుగా విభజించిన పిమ్మట, మధ్య కోష్టము వదలినచో ఎనిమిది దిక్కులయందు 8 గడులు ఉండును ఆ ఎనిమిది గడులు ఎనిమిది దిక్కులకు ప్రతీకలు. అందు దక్షిణ, ఆగ్నేయ భాగములకు చెందిన భూమిని ''హస్తిని'' యందురు నైఋతి, పశ్చిమాలకు చెందిన భాగమును ' మహిషి'' అని అందురు. ఈ రెండు దిశలను ఆక్రమించిన భాగము అనగా నైఋతి మూలను చేర్చి పడమర దక్షిణ సరిహద్దుల మీదుగా నిర్మించిన రెండు శాలలకు ద్విశాలయని పేరు




విశ్వకర్మప్రకాశికయందు కూడా ఈ ద్విశాల మిక్కిలి శుభప్రద మైన దిగా చెప్పబడినది.

దక్షిణే దుర్ముఖం గేహం పశ్చిమే ధాన్య సంజ్ఞికం
సిద్ధార్థాఖ్యం ద్విశాలంచ సర్వసిద్ధికరం నృణాం

అనగా దక్షిణమున ఉత్తరముఖ ద్వారముగల గృహమును, పశ్చిమమున తూర్పు ముఖ ద్వారముగల గృహమును, నైఋతి మూలను జేర్చి నిర్మించిన ''సిద్ధార్థమని'' పేరుగల ద్విశాల అగును. అట్టి ఇంటికి దక్షిణ పడమరలకు కిటికీలు మాత్రమే ఉండును. గుమ్మాలు ఉండరాదు. ఈ నిర్మాణము సర్వార్థ సిద్ధులను ప్రసాదించునని భావము.

గమనిక: ద్విశాలా గృహము నైఋతి మూలను చేర్చి తప్ప - ఆగ్నేయమును చేర్చి గాని, ఈశాన్య మూలయందుగాని వాయువ్య మూలను గాని నిర్మింప రాదు. ఇంతవరకు నైఋతి మూలను చేర్చి దక్షిణపు పారున పశ్చిమపు పారున ద్విశాల నిర్మించ వచ్చునని తెలిసి కొంటిమి కాని విశ్వకర్మ ప్రకాశిక యందు మరి కొన్ని విధాలైన ద్విశాలా నిర్మాణము చెప్ప బడినది. గమనించండి:

ధనంచ పూర్వ దిగ్భాగే ధాన్యం చైవతు పశ్చిమే
నందాఖ్యం తద్విశాలంచ ధనదం శోభనం స్మృతం

ధనదశాల అనగా తూర్పు దిశయందు వరండా, దక్షిణోత్తరముల యందుకూడా వరండాలు గల ఇల్లును నిర్మించి దానికి పడమర ధాన్యశాల (అనగా తూర్పు దిశయందు మాత్రమే వరండా గల) ఇల్లు నిర్మించిన ''నందము '' అను పేరుగల ద్విశాలయగును.

## ద్విశాల - నందము




**శంఖము :**

నాలుగు దిశలయందు వరండాలు గల ఇల్లు లేదా నాలుగు దిశలయందు ద్వారములు గల ఇల్లు ''విజయ'' మనబడును. అట్టి రెండు ఇండ్లు తూర్పున ఒకటి పడమర ఒకటి చేర్చి నిర్మించిన ''శంఖము'' అను పేరు గల ద్విశాల యగును. ఈ ద్విశాల దక్షిణోత్తరముల యందు కూడా నిర్మించవచ్చును. ఈ ఇంటికి నాలుగు దిశలయందు గుమ్మాలు యేర్పరచ వలెను.

విజయం సర్వ దిగ్భాగే ద్విశాలాఖ్యం తద్రైవహి

శంఖాఖ్యం నామ తద్గేహం శుభదంచనృణాం భవేత్॥ విశ్వకర్మప్రకాశిక

ఇంకను వివరముగా ఈ ద్విశాలల గురించి తెలిసి కొనదలచినవారు విశ్వకర్మ ప్రకాశిక 46-47-48 పేజీలు, అపరాజితపృచ్ఛ అను గ్రంథము పరిశీలింప గోరుచున్నాను.



## అయాది సాధన అవసరమా?

అయాది సాధన అవసరమా? అనే ప్రశ్నకు భారతీయ వాస్తు గ్రంధాలన్నీ ముక్త కంఠంతో అవసరమనే చెపుతున్నాయి గృహ నిర్మాణ విషయంలో అయాది సాధన ప్రాణతుల్య మైనదని ఈ క్రింది శాస్త్ర ప్రమాణం నొక్కి చెపుతుంది.

యోనిః ప్రాణాయేవ దామ్నం యదస్మా
ద్గ్రాహ్యే స్తత్తద్యోగ యోనిః ప్రభేదతః

అనగా గృహాది నిర్మాణకార్యముల యందు ''యోని'' అనగా అయాది సాధన ప్రాణతుల్యమని భావము. కాబట్టి సమస్త నిర్మాణ కార్యముల యందు అయాది సాధనకు మిక్కిలి ప్రాముఖ్యత నీయవలసి యున్నది. ఈ విషయంలో శిల్పఋషి శ్రేష్ఠులలో ముఖ్యుడైన మయబ్రహ్మ యొక్క ఈ క్రింది వాక్యమును గమనించండి

''అయాది సంపదర్థం వృద్ధిం హానించ యష్టిభిః కుర్యాత్'' అనే సూత్రం ప్రకారం సంపదల నాసించువారు అయాది సాధన చేయవలయునని భావము. అంతేగాదు

''అయాదిక మధ సుఖదం వ్యయ మధికం సర్వ నాశం స్యాత్
విపరీతేతు విపత్త్యైః తస్మాత్ సమ్యక్ పరీక్ష కర్తవ్యం''

(మయమతం, 9వ అధ్యాయం 62వ పేజీ)

పై సూత్రమునసరించి అయం (ధనం) అధికమున్న సుఖమని, ఋణమధికమైనచో, సర్వ నాశనమును కలుగ జేయును. కాబట్టి అయాది సాధన శుభప్రదమని తెలుస్తుంది. అంతేగాదు

అష్టౌ యోనయః ఉదితా ధ్వజ, హరి, వృష, హస్తినః, శుభాః''

అనే వాక్యము ననుసరించి సమస్త నిర్మాణ కార్యముల యందు ధ్వజాయము, సింహాయము, వృషభాయము, గజాయము అను నాలుగు ఆయములను మాత్రమే స్వీకరింప వలయునని శాస్త్ర నియమము.

ఈ అయాది సాధన విషయంలో మన ప్రాచీన శిల్ప ఋషుల అభిప్రాయం వైజ్ఞానికమైనది. కానీ ఆధునికులు కొందరు ఆయాది సాధనకు ఏమీ ప్రాధాన్యత ఇవ్వనవసరం లేదంటున్నారు. ప్రాచీన వాస్తు శాస్త్ర సాంప్రదాయాలన్నీ తూచా తప్పకుండా అమలు జరపాలి. కానీ ఈ ఆయాది సాధన మాత్రం వట్టి బూటకమని వాదిస్తున్నారు. ఈ వాదనలో ఔచిత్యం యేమీ లేదు. ఎందు

చేతనంటే శాస్త్రంలో ఉన్న అన్ని నియమాలు పాటించాలి, కాని ఈ నియమం మూఢ నమ్మకము? అనే వాదన ఏ విధంగా అంగీకరించగలం.

అంతేగాక ఆధునిక ఇంజనీరింగు నందు కూడా ఈ ఆయాది సాధనకు ప్రాతిపదిక కనిపించు చున్నది. గమనించండి. ఒక విద్యాలయం నిర్మించాలను కుందాం. మన ఇంజనీర్లు అందు చదువుకొనే విద్యార్థుల సంఖ్యను బట్టి ఆ విద్యాలయము పొడవు వెడల్పులను నిర్ధారించుచున్నారు. అనగా ఒక్కో విద్యార్థికి ఇన్ని చదరపుటడుగుల స్థలము చొప్పున విద్యాలయమునందు చదివే విద్యార్థుల సంఖ్యను బట్టి, ఆ హాలు పొడవు వెడల్పులను నిర్ధారించుచున్నారు. ఈ విధంగానే పశువుల శాలలకు కూడా, ఇన్ని పశువులు ఉండే శాలకు ఇన్ని చదరపు అడుగుల స్థలం అవసరమని నిర్ణయిస్తున్నారు. ఆఖరికి చిన్న ప్రాణులైన కోళ్ళ పెంపకానికి కూడా ఇన్ని కోళ్ళు పెంచేటందుకు ఇన్ని చదరపుటడుగుల వైశాల్యం గల హాలు కావాలని ఇంజనీర్లు చెపుతున్నారు. ఇదంతా యేమిటి? ఇంత వైశాల్యం గల చోటులో ఇన్ని ప్రాణులు నివసించడానికి యోగ్యంగా ఉంటుందని భావము.

పై వివరణయందలి సారాంశం యేమనగా, ఇంత వైశాల్యంగల స్థలంలో ఇన్ని ప్రాణులకు సరిపడే ఆక్సిజన్ లేక ప్రాణవాయువు ఇమిడి ఉంటుందని పిండితార్థము. ఈ విషయాన్ని మన ఇంజనీరింగు పై విధంగా రూపొందించింది అనగా ఇంత పొడవు ఇంత వెడల్పు ఇంత ఎత్తు గల స్థలంలో, ఆక్సిజన్ ఇమిడి ఉంటుందని భావన.

ఈ సందర్భంలో ఒక ఉదాహరణ గమనించండి. ఒక చిన్న గదిలో ఇరువురు మనుష్యులు నివశించగలరు. అందులో ఒక రోజున 10 మంది నిద్రించారు. ఉదయం లేచే టప్పటికి ఆ పది మందికి చాలా నీరసంగా ఉండుట సహజం. ఎందుచేత? ప్రాణ వాయువు వారికి తగినంతగా లభించక పోవుటచే తనే. ఈ వైజ్ఞానిక సత్యాన్ని ఎవ్వరూ కాదన లేరు. పై విషయాలన్నీ కూలంకషంగా చర్చించిన మీదట, మనం మన శిల్పఋషుల మార్గాన్ని అనుసరించుటలో గల ఔచిత్యం బోధపడుతుంది. ఆ విధంగా ఆయాది సాధన చేసిన యెడల, శుభ ఫలితాలనే పొందగలము. పరంపరాగతంగా వస్తున్న ఈ భారతీయ ఋషిసాంప్రదాయాన్ని విడచి అల్పాయుష్కులు అరకొర విజ్ఞానవంతులైన కొందరి ఆధునికుల మార్గాన్ని అనుసరించుట అజ్ఞానమే కాగలదు.



## పూర్ణపదము - భిన్నపదము

క్షేత్రీకృతము అనగా వైశాల్యము అని భావము. ఈ క్షేత్రీకృతానికి పదము, పిండము అను పర్యాయ పదములున్నాయి. పొడవు X వెడల్పు = పదము అని వ్యవహారంలో ఉన్నది. అనగా గృహ గర్భము యొక్క పొడవును వెడల్పు చేత గుణించగా వచ్చిన సంఖ్య క్షేత్రీకృతమనియు, పదమనియు పిండమనియు వ్యవహరిస్తున్నారు. ఈ పద సంఖ్య ''పూర్ణాంకము'' గా నుండ వలెనని, భిన్నాంకము శుభ ఫలితముల నీయదనియు కొందరి మతము. పూర్ణాంకము గల పదములనే గ్రహింపవలెనని భావించినచో, ఆ పూర్ణాంక పదమునకుగల నక్షత్రమునకు, యజమాని నక్షత్రమునకు తారాబలము సరిప డవలెను. ఆ విధంగా రెండు నక్షత్రములకు తారాబలము సరిపడనియెడల ఏమి చేయాలి? ఈ క్రింది విషయము గమనించండి.

వెంకట్రావు అనే పేరు గల వ్యక్తి చిన్న ఇల్లు నిర్మించుకోవాలనుకుని సిద్ధాంతిగారిని సంప్రదించాడు. ఆ స్థలానికి పడమర వీధి ఉన్నది. పడమర సింహద్వారం పెట్టి ఇల్లు కట్టాలి. ధ్వజాయం మాత్రమే తగినది. సింహాయ, వృషభాయ, గజాయ పదములకు పడమర సింహద్వారం నిషేధం. కాబట్టి చిన్న ఇంటికి ధ్వజాయం గల చిన్న పదం 25 మాత్రం అయితే, ఆ పదానికి గల నక్షత్రం పుబ్బ. మృగశిరకు పుబ్బ నైధన తార. రెండవ పక్షంగా యే యితర తారలైనా స్వీకరింపగలం గాని నైధన తార నిషిద్ధం; 25 పదం తరువాత 49 పదం వరకు ఈ మధ్య పదాలేవీ ధ్వజాయం గల పూర్ణ పదాలు లేవు. ఇట్టి పరిస్థితు లలో భిన్న పదాన్ని స్వీకరింపక తప్పదు.

అయితే ఈ భిన్న పదం స్వీకరించడం తప్పుకాదు. అనేక మంది పండితులు ఈ భిన్న పదాలను స్వీకరించి గ్రంథస్థం చేశారు ఈ భిన్న పదం కూడా శాస్త్రీయమే అని చెప్పడానికి ''వాస్తు విద్య'' అనే ప్రామాణికమైన సంస్కృత గ్రంథంలో ''పర్యంత మానం'' అనే పదసాధన చెప్పారు. కాబట్టి పూర్ణపదం చేత తగిన స్థలాను గుణ్యమైన పదం సాధింప లేనపుడు, విశేష విధి నాశ్రయించి భిన్నాంక పదమును స్వీకరింప వచ్చును. ఇదియు శాస్త్ర సమ్మ తమే యగుచున్నది. ఈ సందర్భములోనే మరో విషయం చర్చింప వలసి యున్నది. గర్భ నిర్ణయంలో పూర్ణాంకమే ఉండాలి. అనగా పొడవులో అంగుళా దులు చేర్చవచ్చునుగాని వెడల్పులో అంగుళాదులు చేర్చరాదని కొందరు చెప్పు చున్నారు. కానీ ఈ వాదము కూడా సరికాదు. పొడవు X వెడల్పు = పదము అనే చెప్పబడినది. కాబట్టి పదమును శుభప్రదమైనదిగా ఎంచుకొని వెడల్పునందు కూడా అంగుళాదులు చేర్చు కొనవచ్చునని మాయభిప్రాయము.

## సూత్ర నిర్ణయము

సూత్రము అనగా త్రాడు: గృహాది నిర్మాణ కార్యాలలో ఉపయోగించే త్రాడునే సూత్రమని వ్యవహరిస్తారు. ఇండ్లు మొదలగు నిర్మాణ కార్యాలలో యెక్కడ నుండి యెక్కడ వరకు కొలత వేయాలి అనే విషయం నిర్ణయించేది సూత్ర నిర్ణయం. ఈ విషయంలో ప్రచారంలో రెండు పద్ధతులు ఉన్నాయి.

**మొదటి పద్ధతి:** గృహాది నిర్మాణములయందు భిత్తి మధ్యం అనగా గోడల మధ్య నుండి కొలతలు గ్రహించుట మొదటి పద్ధతి. అనగా మనం నిర్మించ నున్న యింటి పొడవులో కడ గోడలు రెండింటి మధ్యకు కొలత గ్రహించుట, అట్లే వెడల్పులో కూడ గర్భగోడలు రెండింటి మధ్యకు కొలతను స్వీకరించుట భిత్తి మధ్య సూత్ర మగును.

ఈ భిత్తి మధ్యకు కొలతలు గ్రహించి ఆయాదికమును గుణించుట సర్వ సమ్మతమని మయుడు, విశ్వకర్మ, పరాశరుడు, మండన సూత్రధారుడు మొదలైన మహర్షులు స్పష్టపరచి యున్నారు. ఈ పద్ధతి ఆచరణలోకూడా వివాద రహితమైన, శ్రేష్ఠమైన పద్ధతి. సంస్కృత గ్రంధాలన్నింటిలోనూ పై పద్ధతి స్పష్టంగా వివరింపబడినది.

**రెండవ పద్ధతి :** ఈ పద్ధతియందు ఇంటి యొక్క రెండు కడ గోడలను విడచి పెట్టి ఉరిలోపు కొలతలనే గ్రహించెదరు. ఈ ఉరిలోపు కొలతలచేత పదము (పిండము) సాధించు పద్ధతి కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలకు మాత్రమే పరిమితమైయుంది. ఈ కోస్తా ప్రాంతంలో ఈ ఉరిలోపు కొలతలు బహుళ ప్రచారంలో ఉన్న పద్ధతి. కానీ అక్కడక్కడ సంస్కృత గ్రంధ పరిచయమున్నవారు మాత్రం భిత్తి మధ్యమునే స్వీకరించి ఆయాది సాధన చేస్తున్నారు. ఈ ఉరిలోపు కొలతలు కూడా శాస్త్ర సమ్మతమే. ఆంధ్ర దేశంలో విశేషంగా వాడుకలోనున్న ''కృష్ణవాస్తు'' ఈ ఉరిలోపు కొలతలనే ప్రతిపాదించింది. మరొక ప్రాచీన సంస్కృత వాస్తుగ్రంధం ''అపరాజిత పృచ్ఛ'' కూడా ఈ ఉరిలోపు కొలతలను గ్రహించవలెనని స్పష్ట పరచినది కాబట్టి ఈ ఉరిలోపు కొలతలు గ్రహించుట శాస్త్ర సమ్మతమే. కాబట్టి ఈ సూత్ర నిర్ణయానికి సంబంధించినంత వరకు ఏయే ప్రాంతము నందు నివశించువారు ఆయా ప్రాంతీయ ఆచారాన్ని అనుసరించి నిర్మాణ

కార్యాలను చేపట్టుట శ్రేయోదాయకము. ఆ విధంగా చేయనియెడల యజమాని, విపరీతమైన మానసికమైన గ్లానికి లోనుకావలసి వస్తుంది

## గృహ గర్భానికి మాత్రమే పిండ సాధన చేయాలి –

పిండము లేక పదము శాలా భాగానికి మాత్రమే పరిమితమైనది. ప్రస్తుతం ఆంధ్రదేశంలో అధిక భాగం ఈ పద్ధతినే అవలంబిస్తున్నారు ఈ పద్ధతి శాస్త్ర సమ్మతమేనని చెప్పడానికి ఈ క్రింది శ్లోకము ప్రమాణము

శ్లో॥ అలింద నిర్వ్యూహ వినిర్గమాద్యా
చతుర్దిశంయే గృహభూషణాయ
ఆయాదికం తేషు న చింతనీయం
యతో నతే వాస్తు పరిగ్రహాస్యుః

(వాస్తురత్నాకరం - 59 పేజీ)

అనగా వరండాలు, మార్గాలు, పోర్టికోలు మొదలైన వాటికి గృహాలంకరణ నిమిత్తం చేసే నిర్మాణాలకు ఆయాదికం చూడనవసరం లేదని భావము. కాబట్టి ఆంధ్రదేశంలో బహుళ ప్రచారంలో ఉన్న గర్భ గృహానికి మాత్రమే ఆయాదికం సాధించుట శాస్త్ర సమ్మతమేనని మా అభిప్రాయం.

## సర్వాయం:

సర్వాయం అంటే వరండాలతో సహితంగా మొత్తం ఇండ్ల ఆక్రమించిన స్థలానికి ఆయాదికం సాధించుట అని అర్థం. ఈ పద్ధతి కొన్ని ప్రాంతాలలో ఆచారమునందున్నది. ఒక విధంగా ఈ పద్ధతికి కూడా శాస్త్ర నియమముంది. మయుడు, మానసార మహర్షి, వసారాలతో సహితంగా గల మొత్తం ఇంటిని ఒక ''యూనిట్'' గా తీసికొని శాలా స్వరూపాన్ని వర్ణించారు. కాబట్టి అలింద సహితంగా గల మొత్తం ఇంటికి ఆయాదికం సాధించుట కూడా శాస్త్ర సమ్మతమే.

కానీ, ఇక్కడ ఒక ముఖ్యవిషయం తప్పక గ్రహించి తీరాలి. గర్భ గృహానికి ప్రత్యేకంగా వర్గారూఢానికి, తగిన ఆయాదికం సాధించి, ఆ పిమ్మట సర్వాయం వరండాలతో సహితంగా గణితంచేయడం సర్వసమ్మతమైన విషయం. ఈ సర్వాయ పద్ధతి చాలా క్లిష్టమైనది, మిక్కిలి శుభప్రదమైన విశేష విధి అని తెలియగలదు.



# నవ వర్గు గణిత క్రమము

నవ వర్గు గణితక్రమం కాళిదాస కృతమగు ''కాలామృతమనే'' పరమ ప్రామాణికమైన జ్యోతిష గ్రంథం ఆధారంగా ప్రతిపాదింప బడినది. ఈ కాలామృత పద్ధతి ననుసరించి నవ వర్గును సాధించిన, సువర్గు పదములుగల గ్రంథాలు మనకు అనేకము లభ్యమగుచున్నవి. ప్రస్తుత కాలంలోనే స్థపతులు గాని సిద్ధాంతులుగాని శ్రమపడి క్రొత్తగా పదములకు నవవర్గును సాధించే పనిలేదు. గణితం ద్వారా ఎన్ని సువర్గ పదాలు సాధించగలమో, అన్ని విధాలైన పదాలు వరుస క్రమంలో గ్రంధస్థం చేసి ఉంచారు. అట్టి మహానీయు లందరికి మనం ఋణ పడి ఉంటాం. ఈ నాటి సిద్ధాంతులు ఆయా సువర్గు పదాలను, వర్గారూఢ పద్ధతికి అనువైనవాటిని గ్రహించి వినియోగించు కోవడమే మన కర్తవ్యము. అయితే ఆ నవ వర్గు శుద్ధి గల పదం యే పద్ధతిలో గుణింప బడినదో, ఆ విధానం యేమిటో, ప్రతీ సిద్ధాంతికి తెలియవలసి ఉంది. కాబట్టి ఆ విధానాన్ని ఇక్కడ పొందు పరుస్తున్నాము. ఈ గణితానికి మనం ఎంచుకున్న ''పదము'' ప్రాతిపదిక.

**గణిత క్రమము :**

1. పదము X 9 - 120 = ఆయుర్దాయము
2. పదము X 9 - 8 = ఆయము
3. పదము X 8 - 12 = ధనము
4. పదము X 3 - 8 = ఋణము
5. పదము X 9 - 7 = వారము
6. పదము X 8 - 15 = తిధి
7. పదము X 8 - 27 = నక్షత్రము
8. పదము X 6 - 9 = అంశ
9. పదము X 9 - 8 = దిక్పతి

ఈ నవ వర్గు సాధనలో కొన్ని గ్రంథాంతరాలున్నాయి. చూడండి-

పదము X 6 - 30 = తిథి

పదము X 8 - 30 = తిథి

పదము X 5 - 27 = నక్షత్రము

పదము X 8 - 120 = ఆయుష్షు

ఈ విధమైన మతాంతరాలున్నా, మనకు మొదటి పట్టికయే బహుళ ప్రచారమునందున్నది. అదియే గ్రహింపదగినదని మా అభిప్రాయము.

ఈ గణిత క్రమంలో మెలకువలు గమనించుడు.

1. ఆయుష్షు అనే ఆయుర్దాయం 60 దాటి ఉండాలి. 60 లోపునున్న పదం స్వీకరింపరాదు.
2. ధనం అధికంగాను ఋణం తక్కువగా గల పదమే గ్రహించాలి.
3. వారం 3 మంగళవారం వచ్చిన పదం విడిచి పెట్టాలి.
4. యజమాని జన్మ, నామ నక్షత్రాలకు, పదమునకు సంబంధించిన నక్షత్రానికి, తారాబలం చూడాలి. ఒక వేళ తారాబలం సరిపడని పదం లభించిన యెడల, నైధనతార మాత్రం రాకుండా చూచి, మరే తారనైనా గ్రహింపవచ్చును.
5. ఆయము, వర్గారూఢమునను సరించి ముఖద్వారానికి తగిన పదమునే స్వీకరించాలి.
6. 1-4-5-6 సంఖ్యగల అంశలు గల పదము గ్రహించ కూడదు.
7. ధ్వజాయ పదమునకు నాలుగు దిశలయందు ముఖద్వారమును ఉంచవచ్చును.

సింహాయ పదమునకు - ఉత్తర తూర్పు సింహద్వారము మాత్రమే నిర్మింపవలెను.

వృషభాయ పదమునకు - తూర్పుదిశయందు మాత్రమే ముఖద్వార ముంచవచ్చును. పశ్చిమ, ఉత్తర, దక్షిణ దిశలయందు ముఖద్వారము నిర్మింపరాదు.

గజాయ పదమునకు - దక్షిణదిశ యందు, తూర్పుదిశయందు మాత్రమే ముఖ ద్వారములుంచి నిర్మాణము చేయవలెను.

ఈ నవర్గ గణిత క్రమంలో వచ్చిన, పదమునందలి పైనుదహరించిన పొరపాట్లు రాకుండా సరిచేసుకొని, పూర్ణపదముగాని, అది భిన్న పదమైనా గాని యజమాని యొక్క వర్గా రూఢమునకు తగిన పదమును గ్రహించి, గృహాది నిర్మాణములు చేయుట శ్రేయోదాయకము.

## గృహ నిర్మాణంలోగల కొన్ని మెలకువలు

వెనుకటి ప్రకరణంలో ఇండ్లు యే యే క్రమాన్ననుసరించి నిర్మించాలి అనే అంశం చర్చించబడినది. ఈ ప్రకరణంలో గృహ నిర్మాణ సమయంలో తీసికొనవలసిన జాగ్రత్తలను గురించి వివరింప బడుతుంది.

మనం గృహ నిర్మాణం కోసం సేకరించే స్థలం ఏ విధంగా ఉండాలి. ఆకార ప్రాకారాలు ఎలాగ ఉండాలి అనే విషయం పరిశీలిద్దాం. గృహ నిర్మాణానికి సేకరించే స్థలం ఆయతంగా గాని, చతురస్రంగాగాని ఉండాలి. ఆయతం అంటే దీర్ఘ చతురస్రాకారపు స్థలం. ఈ ఆయత స్థలం యొక్క ఎదురెదురు భుజాలు, లేక దిశల కొలతలు సమానంగా ఉంటాయి. చతురస్రం అంటే నాలుగు భుజాలు అనగా నాలుగుదిశల కొలతలు సమానంగా ఉంటాయి. నాలుగు కోణాలు మూల మట్టానికి సరిపోవాలి.

''ఆయతే సిద్ధయస్సర్వా చతురస్రే ధనాగమః''

అని శాస్త్ర వచనం స్పష్ట పరుస్తూంది. త్రికోణ భూమిగాని, చేట ఆకారపు భూమిగాని, నిర్మాణానికి పనికి రాదు. గృహ నిర్మాణ స్థలానికి నాలుగు మూలలే ఉండాలి. నాలుగు దిశల సరిహద్దులు వంకరగా నుండ రాదు.

దిఙ్మూఢే కులనాశస్యాత్ వక్రే దారిద్ర్యమాదిశేత్''

ఏ దిక్కులు లోపించరాదు. వంకరలుండ రాదు.

**దిశలు - దిక్సూచి :-** సాధారణంగా నూటికి 90 స్థలాలు, దిక్సూచికి అనుకూలంగా ఉండవు. కాబట్టి మనకు లభించిన స్థలాన్ని దిక్సూచిని అనుసరించి సవరించుకొని, నాలుగు దిశలు తీర్చి, నాలుగు మూలలయందు మూల మట్టమునకు సవరించుకొని, ఆ పిమ్మట ''ఈశప్రాచీ'' గా తీర్చి దిద్దాలి. మిగిలిన కోసు భూములను బయటకు విడచి పెట్టి స్థలాన్ని సరిచేసుకోవాలి.

కొంతమంది ఆధునికులు ఆ విధంగా మిగిలిన కోసు భూములను ఇతరుల పేర వ్రాసి ఇచ్చి వేయాలని అంటున్నారు. ఈ సూచన శాస్త్ర విరుద్ధమేగాక ఆచరణ సాధ్యం గానిది.

ఉదా: ఒక యజమానికి ఒక చోట 5 ఎకరాల తోట ఉన్నచో అతడు తనకు కావలసిన చోట గృహ నిర్మాణం నిమిత్తం 500 చదరపు గజముల స్థలం దిక్సూచికి అనుకూలంగా సేకరించి గట్లు వేసుకొని గాని, ప్రహరీ గోడతో గాని స్థలాన్ని వేరు చేసుకొని మిగిలిన భూమిని అతడు ఎవరికైనా ధారా దత్తం చేయాలా? ఇది అసాధ్యం, మనం సేకరించిన స్థలమే మనకు వాస్తువు అగును. నివాసం కొరకు గ్రహించిన భూమియే వాస్తు పరిధి లోనికి వస్తుంది.

## దేశము – కాలము – పాత్రత :

సర్వే సర్వత్ర, దేశ, కాల, పాత్రతల స్థానం తిరుగు లేనిది. వాస్తు శాస్త్రం కూడా ఈ దేశకాల పాత్రతకు దూరం కాదు. ప్రతి స్థపతి లేక సిద్ధాంతి దేశకాల పాత్రతలకు అనుకూలంగా శాస్త్ర నియమాలను కొంత మేరకు సవరించు కోవాలి. దేశం - గృహ నిర్మాణ విషయంలో స్థపతి ఆయా దేశములయందు, ప్రాంతముల యందున్న నిర్మాణశైలిని అనుసరించాలి. సముద్ర తీర ప్రాంతంలో ఉండే శైలి అరణ్య ప్రాంతాలలో వినియోగించ రాదు. అరణ్య ప్రాంతాల శైలి మైదాన ప్రాంతాలలో అమలు పరచరాదు. ఈ శైలీ భేదాన్ని తప్పక పాటించాలి.

''చింతలు, మారేళ్ళు, శ్రీతాళ జాలముల్ వేపలు మొలచిన నీరసంబు
హింతాళములు నహీనముగ నారికేళ సంఘములున్న కీర్తి లేదు''

అనే ప్రమాణాన్ననుసరించి చింత చెట్లున్నచో ఇండ్లు కట్టరాదు. కాని ఈ సూత్రం అటవీ ప్రదేశాలకు వెళ్ళి ఏ సిద్ధాంతి అమలు పరచగలడు? ఆ విధంగానే కోనసీమకు వెళ్ళి కొబ్బరి చెట్లు లేని చోట ఇల్లు కట్టాలని చెప్పిన ఎవరు వింటారు. కాబట్టి ఆయా ప్రాంతాన్నిబట్టి పరిగణించాలి.

కాలము :- కాల ప్రభావాన్ని మనం గుర్తించి తీరాలి. గృహారంభ ముహూర్త విషయంలో ఈ కాలమానం పరిగణనకు తీసుకోవాలి. మాస వాస్తు క్రమంలో, ఈ పరుగులు తీసే పోటీలలో నిర్మాణ కార్యాలు ప్రారంభించలేము. అందుచేత నిత్య వాస్తు సాంప్రదాయాన్ని స్వీకరించి గృహ నిర్మాణాలు చేపట్టాలి. ఆధునిక కాలంలో పాశ్చాత్య సాంప్రదాయంలో పెరిగిన ఇంజనీర్లు, ప్రభుత్వ భవనాల నిర్మాణాలు, జ్యోతిష - వాస్తు సాంప్రదాయాలకు విరుద్ధంగా చేస్తున్నారు; ఆ పరుగు పందెంలో, కాళిదాస ప్రతిపాదితమైన నిత్య వాస్తునే ఆశ్రయించడం వివేకమైన పని.

పాత్రత :- పాత్రత అనగా గృహ నిర్మాణ కర్తయొక్క ఆర్థిక సామాజిక అర్హతలను పరిగణన లోనికి తీసుకొనుట. గృహ యజమాని సామాన్య గృహస్తుడు అయినపుడు అతనికి స్థలమున్నది గదా! అని గాని, లేక పేరుకు తగిన పదము సరిపడుట లేదని గాని ఒక భవనానికి ప్లాను సిద్ధం చేస్తే ఆ నిర్మాణం పూర్తిగా కొనసాగదు అట్లే ఒక ధనవంతునికి అతని హోదా ఆర్థిక పరిస్థితికి తగు విధంగానే భవన రూప కల్పన చేయాలి గాని చిన్న ఇంటిని రూపొందించ గూడదు. ఆధునికకాలంలో పట్టణాలలో గృహ నిర్మాణస్థలం లభ్యం కావడమే కష్టము. కాబట్టి యజమాని సంపాదించిన స్థలాన్ని సామాన్య విధి చేత గాని విశేష విధి చేత గాని గృహ నిర్మాణం చేపట్టాలి గాని ఆ స్థలం పనికిరాదని నిషేధింపరాదు.

స్థలానుగుణ్యమైన నిర్మాణము :- గృహ యజమాని సంపాదించుకొన్న స్థలానికి తగిన ఇంటినే స్థపతి గాని సిద్ధాంతి గాని రూపకల్పన చేయాలి. అంతే గాని స్థలం ఎంత ఉందో అంతా నిర్మాణం ఆక్రమించే విధంగా ప్లాను తయారు చేయరాదు.

స్థలం యొక్క పొడవు వెడల్పులలో తొమ్మిదవ భాగం నాలుగు దిశల యందు ఖాళీయుంచి, మధ్య భాగంలో ఇల్లు కట్టాలి. తూర్పు, ఉత్తర దిశల యందు ఖాళీ స్థలం విడిచి పెట్టకుండా ఇల్లు కట్టరాదు. స్థలానికి దక్షిణ, పశ్చిమ సరిహద్దులో కనీసం మూడడుగులు తక్కువ కాకుండా స్థలం పిశాచ భాగంగా విడచి పెట్టి ఇల్లు కట్టాలి. అట్లు దక్షిణ, పశ్చిమ దిశలయందు ఖాళీ విడచి కట్టని ఇల్లు, అనేక కష్టనష్టాలకు లోనై పైశాచిక పీడకు గురికాగలదని శాస్త్ర వచనము.

ఏయే దిశలయందు ఎంతెంత స్థలం విడిచి పెట్టాలి?

ఇంటికి ఏయే దిశలయందు ఎంతెంత స్థలం విడిచి గృహ నిర్మాణం చేయాలో విశ్వకర్మ ప్రకాశిక ఈ క్రింది విధముగా చెప్పుచున్నది

ఉత్తరే ద్విగుణా భూమీ సమభూమిశ్చ పూర్వకే
పశ్చిమే త్రిగుణా భూమి క్రోశమేకంతు దక్షిణే

అనగా ఇంటి యొక్క గర్భ గోడ ఎంత ఎత్తు ఉన్నదో దానికి రెండింతలు ఉత్తర దిశయందు, గర్భ ప్రమాణమునకు సమానమగు ఖాళీ స్థలము తూర్పు దిశయందు, పడమర దిశయందు మూడురెట్ల భూమి దక్షిణము బహు విశాలమైన స్థలము కలిగి యుండవలెనని భావము ఈ ప్రాచీన సూత్రాన్ని ఆధునిక కాలంలో అమలు చేయలేక పోయినా ఇంటికి నాలుగు దిశలయందు ఇంటిగర్భమెంత ఎత్తున్నదో అంత ఖాళీ స్థలమైనా విడచి పెట్టి గృహ నిర్మాణము చేయాలి.

**పొరులు :-** పురః అనే సంస్కృత శబ్దం నుండి పొరు అనే సంకేత పదం పుట్టింది. అంటే ఏదయినా ఒక స్థలంలో ఆ స్థలానికి ఎదురుగా ఉన్న ఇంటిగోడ పొరులు స్వీకరించుట శిల్పసమయము. అయితే ఇక్కడ మరో ధర్మ సూక్ష్మము గ్రహించాలి. గృహ నిర్మాణ స్థలానికి ఎదుట ఒక చిన్న ఇల్లు ఉందని భావించిన, ఆ ఇల్లు రెండు గదులు గలది, తొమ్మిది అడుగులు పొడవు గలది. క్రొత్తగా నిర్మించే ఇల్లు 12 అడుగుల గదులకు తక్కువ కాని భవనము. అలాంటి పరిస్థితులలో ఏమి చేయాలి? వివేక వంతుడైన శిల్పి, ఎదుట ఇంటిది ఏదొక కడగోడను గాని, మధ్యగోడను గాని పొరుగా తీసికొని నిర్మాణాన్ని చేపట్టుట ఉచితమైన పని. సమర్థులైన శిల్పులు తమ తమ అనుభవాలను జోడించి నిర్మాణాలు చేయాలి.

**గృహ గర్భ వివరణ :** గృహ గర్భమనగా, ఏకశాలకు వరండాలు లేకుండా గదులు గల భాగం మాత్రమే అని వ్యవహారంలో ఉన్నది. ఎందుచేతననగా, ఆయాది సాధనలో గర్భం యొక్క పొడవు వెడల్పులను గుణించి పదము కట్టుట అనూచానంగా వస్తున్న ఆచారం

ఆయామేన విశాలమేవ గుణయేత్ క్షేత్రీ కృతం యత్పదం ''

అనగా పొడవు X వెడల్పు = పదము అని భావం. గర్భం ఎంత ప్రమాణమున్నదో అంత గోడ ఎత్తు నిర్ణయించ బడింది. అయితే ఇక్కడ మరొక విషయం గమనార్హము, చాలా ప్రాంతాలలో గృహ గర్భానికి మాత్రమే ఆయాది సాధన చేయుట వాడుకలో నున్నది కాని మరికొన్ని చోట్ల సర్వాయం అనగా వరండాలతో సహితంగా ఆయాది సాధన చేస్తున్నారు. ఈ పద్ధతికి కూడా శాస్త్రాధారాలన్నాయి కాబట్టి ఈ విషయంలో మనం ప్రాంతీయమైన ఆచారాన్ని అవలంబించుట శ్రేయోదాయకము. గదుల వైశాల్యం చాలనపుడు, గర్భ భాగము వరండా భాగములను కలిపి పెద్ద గదులు నిర్మించుకొన వచ్చును. అట్లు నిర్మించునపుడు శాలా అళింద భాగముల మధ్య పై భాగమున తనాబీలను వేయవలెను. క్రింద భాగమున (ఫ్లోరింగు) కూడ గర్భము - వసారా భాగములకు వర్గీకరణ చేసి ఫ్లోరింగు చేయవలెను.

## గేటు ఎక్కడ పెట్టాలి ?

సింహద్వారానికి ఎదురుగా గేటు పెట్టాలి ఆ విధంగా వీలు లేనపుడు ఈ క్రింది విధంగా నిర్మించాలి

స్థలము యొక్క ప్రహారీ గోడ దాటి స్థలము లోనికి ప్రవేశించు ప్రవేశ ద్వారముగేటు తూర్పు దిశయందున్న యెడల ఆ స్థలంలో కట్టే ఇంటికి దక్షిణ సింహద్వారముంచుట శ్రేష్ఠము ప్రహారీగోడ దాటి, ఆవరణలోనికి ప్రవేశించు గేటు దక్షిణ దిశయందున్న యెడల ఆ స్థలంలో కట్ట దలచిన ఇంటికి పడమర సింహద్వారముంచుట శ్రేష్ఠము ప్రాకారము దాటి ఆవరణలోనికి ప్రవేశించు ద్వారము (గేటు) స్థలానికి పడమర దిశయందున్నచో ఆ స్థలంలో కట్టే ఇంటికి ఉత్తర సింహద్వారం ఉంచుట శ్రేష్ఠము రాజ వీధి నుండి ప్రహారీ దాటి ఆవరణ లోనికి ప్రవేశించు ప్రవేశద్వారము (గేటు) ఉత్తర దిశయందున్న యెడల, ఆ స్థలంలో కట్టే ఇంటికి తూర్పు సింహద్వారముంచుట శ్రేష్ఠము



## ఉపగ్రహముల నిర్మాణం - నీటి పారుదలలు

ఉప గృహములలో వంట శాలలు, ధాన్య శాలలు, పశువుల శాలలు, పూజా గృహాలు ముఖ్యమైనవి. ఈ ఉప గృహాలు ఇంటి ప్రహారీ గోడ మీద అనుకొని నిర్మింపరాదు. అయితే ఆధునిక కాలంలో తగినంత విశాలమైన స్థలాలు, పట్టణాలలోను, నగరాలలోను, లభింపక పోవుటచేత ప్రహారీ గోడను చేర్చి, లోపలి తట్టు నానుకొని రెండవ గోడను కట్టి, దాని పై ఉప గృహాలు నిర్మించుకొను పద్ధతి మధ్యమ పక్షముగా స్వీకరింపవచ్చును.

వంట శాలలు :- ఆరోగ్యమే మహాభాగ్యం. ఎన్ని సంపదలున్నా ఆరోగ్య సంపదకు అవి సాటి రావు. మన ఆరోగ్యం మనం తినే ఆహారం మీదే ఆధారపడి ఉంటుంది. మనం తినే ఆహారం శుచిగా, పుష్టిగా, తుష్టిగా ఉండాలి క్రిమి కీటకాల నుండి మన ఆహార పదార్థాలను సంరక్షించుకోవాలి. మనం తినే ఆహారం దోష రహితంగా ఉండాలంటే వంటశాల తగినంత విశాలంగాను, గాలి, వెలుతురు చక్కగా ప్రసరింపబడే విధంగాను నిర్మించుకోవాలి. ఎన్ని మేడలు, మిద్దెలు కలిగియున్నా వంటశాల ఆరోగ్యప్రదంగా లేక పోతే ఆ సంప దలన్నీ నిరుపయోగం అని భావించాలి. వంటశాలయే మన ఆరోగ్యానికి ఆధా రభూతమని నమ్మితీరాలి.

విశ్వకర్మ మతానుసారం యే ముఖద్వారం గల ఇంటికైనా ఇంటికి వెనుక భాగంలో అనగా, ఇంటి వెనుక గల పెరడులో వంటశాల నిర్మించుకోవాలి. ఆ విధంగా వంట ఇల్లు ఇంటి లోపల పెరడునందే ఉంటే, ఇంటి యజమానురాలు వంటింటి పనులయందు అజమాయిషీ కలిగి ఉంటుంది.

కానీ ఆధునికులు కొందరు వంటశాల ఇంటికి ఆగ్నేయ దిశలోనే తప్ప మరెక్కడా నిర్మించరాదని చెప్పి తూర్పు సింహద్వారము గల ఇంటికి ముందు గల వాకిలిలో, ఆగ్నేయ కోణంలో, వంటిల్లు నిర్మింపజేస్తున్నారు. లేదా ఆ ఇంటికి తూర్పు వరండాలోగల ఆగ్నేయ కోణంలో ఉన్న గదిలో, వంట చేస్తున్నారు. ఈ పద్ధతి పూర్తిగా ఆచార విరుద్ధము. అంతేగాక ఆచరణయోగ్యం కూడా కానేరదు. విశ్వకర్మ వాస్తుశాస్త్రాన్ననుసరించి ఇంటికి ప్రధానంగా మూడు భాగాలుంటాయి. ఇంటికి సింహద్వారము ముందుగల భాగం దేవ భాగం. ఈ భాగంలో అనగా, ఇంటి ముందటి వసారా భాగంలో, అతిథి అభ్యాగతులకు

వసతి కల్పించాలి. బంధుమిత్రుల సమావేశం చేయవచ్చును. పురాణ కాలక్షేపం చేయవచ్చును.

రెండవభాగం గర్భగృహం. ఈ గర్భగృహం అనే గదులు గల భాగం, గంధర్వ భాగం అనే పేరుగలది. ఈ గంధర్వ భాగంలో గృహయజమానుని పడకగది, పిల్లలు, ఇతరులకు పడకగదులు ఏర్పరచుకోవాలి.

మూడవ భాగం మనుష్యభాగం. ఇంటికి వెనుక భాగమునందలి వసారా భాగము. ఆ వరండా తరువాత గల ఖాళీ ప్రదేశము మనుష్యభాగం అగును. ఈ మనుష్య భాగంలోనే వంట శాలలు నిర్మించు కోవాలి. ఆ విధంగా ఇంటికి వెనుక భాగంలో వంటశాల నిర్మించినపుడు మాత్రమే ఇంటి యజమానురాలు వంటింటిపై అజమాయిషీ చేయగలుగుతుంది. కాబట్టి విజ్ఞులైనవారు ఇంటికి పృష్ఠభాగంలోనే అనగా వెనుకగల పెరటిలోనే వంట శాలలు నిర్మింపగలరు.

**తూర్పు సింహద్వారము:–** తూర్పు సింహద్వారము గల ఇంటికి, పడమర గల కాళీ స్థలంలో, నైఋతి వాయువ్యకోణ దిశాభాగములయందే వంటశాలలు నిర్మించు కోవాలి.

**దక్షిణ సింహద్వారము:–** దక్షిణ సింహద్వారంగల ఇంటికి ఉత్తర దిశయందు గల కాళీ స్థలంలో, వాయువ్య దిశయందు మాత్రమే వంటిల్లు నిర్మించుకోవాలి.

**పడమర సింహద్వారము:–** పడమర సింహద్వారంగల ఇంటికి తూర్పునగల ఖాళీ స్థలంలో, ఆగ్నేయ దిశయందు వంటిల్లు నిర్మించుకోవాలి.

**ఉత్తర సింహద్వారము:–** ఉత్తర సింహద్వారము గల ఇంటికి దక్షిణ దిశయందుగల కాళీ ప్రదేశంలో, నైఋతి దిశయందుగాని, ఆగ్నేయ దిశయందుగాని వంటశాలలు నిర్మించు కొనవచ్చును.

**ధాన్యశాలలు:–** మనం అన్నగత ప్రాణులం. అన్నం లేనిదే బ్రతకలేం. కాబట్టి ధాన్యాన్ని నిల్వ చేసికొనుటకు ప్రత్యేకమైన వసతి కావాలి. కాబట్టి ధాన్యం నిల్వ చేసికొనుటకు అనువైన ధాన్యపు కొట్లు ఇంటికి వాయువ్య దిశయందు తూర్పు ముఖంగా గాని, దక్షిణ ముఖంగాగాని నిర్మించు కోవాలి. వాయువ్యదిశ ధాన్యశాలలకు చాలా శ్రేష్ఠము.

నైఋతి దిశయందుగాని, ఆగ్నేయమునందుగాని, ధాన్యాగారములు నిర్మించుట రెండవ పక్షముగా గ్రహింపవచ్చును. ఈశాన్య దిశయందు ఏ విధమైన నిర్మాణములు చేయరాదు.

**పశువుల శాలలు:-** ఇంటికి వాయువ్య దిశయందే నిర్మించుట శ్రేష్టము. ఆగ్నేయ దిశయందు నిర్మించుట రెండవ పక్షము. మేకలు, గొఱ్ఱెలు, గేదెలు మొదలైన పశువులకు నైఋుతి దిశయందు శాలలు నిర్మింప వచ్చును. ఈశాన్య దిశయందు పశువుల శాలలు నిర్మించరాదు.

**నీటి పారుదలలు:-** గృహావరణలోని వర్షపునీరు, ఉత్తరదిశకుగాని, తూర్పు దిశకుగాని, ఈశాన్యమూల నుండిగాని బయటకు పోవాలి. ఈ నియమము శ్రేష్ఠమైనది. కాని, ఈ నియమము అన్ని చోట్ల వర్తింపదు. అట్టి పరిస్థితులలో ఈ క్రింది విశేషవిధి మయబ్రహ్మ తన 'మయమత' వాస్తుశాస్త్రమునందు వివరించి యున్నాడు.

**తూర్పు సింహద్వారము:-** తూర్పు సింహద్వారముగల ఇంటికి, ఎడమ ప్రక్కన గల ఉత్తర దిశయందు, ఉత్తర వాయువ్య దిశల మధ్య భాగంలో గల ఖాళీ ప్రదేశంలో నీటి పారుదలకు తూములు యేర్పరచవచ్చును.

**దక్షిణ సింహద్వారము:-** దక్షిణసింహద్వారముగల ఇంటికి ఎడమ ప్రక్కన గల తూర్పు, ఈశాన్య దిశల మధ్య నీరు బయటకు పోవు తూము ఏర్పరచు కొనవచ్చును.

**పడమర సింహద్వారము:-** పడమర సింహద్వారముగల ఇంటికి, ఎడమ పార్శ్వమునగల దక్షిణదిశ యందు, దక్షిణ ఆగ్నేయములకు మధ్యగల భాగ మున నీటి పారుదలకు తూములు నిర్మింపవచ్చును.

**ఉత్తర సింహద్వారము:-** ఉత్తర సింహద్వారముగల ఇంటికి, ఎడమ పార్శ్వమునగల పడమర దిశయందు, పడమర నైఋుతి దిశల మధ్య భాగంలో నీరు బయటకుపోవు మార్గము యేర్పరచవలెను.

ఈ విధమైన విశేష విధులున్నందున ఆయా సింహద్వారములుగల ఇల్లు కాకున్నను, గత్యంతరము లేనపుడు పై నుదహరించిన దిశాభాగముల నుండి నీరు బయటకు పోవు తూములు ఏర్పరచుకొనవచ్చును

నూతులు, కుళాయిలు ఇంటికి తూర్పు ఈశాన్య, ఉత్తర దిశాభాగ ములందు మాత్రమే నిర్మింప వలెను. తూర్పుదిశయందు నూయి తీయుట, రెండవ పక్షముగానే చెప్పబడినది.





నేటి జనాభా పెరుగుదల క్రిక్కిరిసిన నగర గ్రామ, ప్రజల అవసరాలకు అనుగుణంగా సెప్టిక్ లేవట్రీల అవసరం ఏర్పడింది. పెద్ద పెద్ద నగరాలలోనేగాక చిన్న చిన్న గ్రామాలలో సైతం సెప్టిక్ లేవట్రీలు లేనిదే కాలం గడవడం లేదు. కాబట్టి ఈ నిర్మాణాలను గురించి వివరించాలి.

సెప్టిక్ లేవట్రీలకు భూగర్భంలో ఒక కుండీ నిర్మించవలసి ఉంటుంది. ఆ సందర్భంలో కొంతమంది ఒక వితండ వాదం లేవనెత్తు తున్నారు. సెప్టిక్ టేంకు నుయ్యిలాంటిగోతులు కాబట్టి ఆగ్నేయంలో ఉండ కూడదని కొందరు నైఋతిలో ఉండకూడదని అంటున్నారు. మరికొందరు వాయువ్యంలో కూడా ఉండకూడ దంటున్నారు. ఆ విధంగా మూడు దిశలయందు సెప్టిక్ టేంకులు నిర్మింప కూడదని భావించినట్లయితే అసలు- సెప్టిక్ లేవట్రీలు నిర్మించ కూడదు ఆ సెప్టిక్ లేవట్రీలు లేకపోతే ఈ నాటి నగర జీవనమేకాదు, గ్రామజీ వనం కూడా కష్టతరమేనని భావించాలి

కాబట్టి ఒక విషయం.గమనించండి - సెప్టిక్ లేవట్రీలకు నిర్మించే టేంకులు భూగర్భంలో ఉండేవి. పైకి కనిపించని నిర్మాణాలు.నైఋతి, ఆగ్నేయ, వాయువ్య దిశలయందు నూతులు తీయకూడదు. కాని సెప్టిక్ టేంకుల నిర్మాణం తప్పు కాదు. కాబట్టినైఋతి, ఆగ్నేయ వాయువ్య దిశలయందు సెప్టిక్ టేంకులు నిర్మించుటలో ఏ విధమైన దోషము లేదని భావము. ఈశాన్య ఉత్తర దిశా భాగములలో మాత్రము సెప్టిక్ టేంకులు ఎట్టి పరిస్థితులలోను నిర్మింపరాదు.





ప్రతీ గృహస్తుడు తన నివాస గృహం యొక్క ఆవరణయందు అనగా ప్రాకారముయొక్క లోపలి భాగంలో అవసరమైన చెట్లు, మొక్కలు, ఫల వృక్షాలు, పూలపొదలు పెంచాలని ఆకాంక్షిస్తాడు.

గృహావరణలో చెట్లు, మొక్కలు పలు రంగులలోనుండే పూల మొక్కలు, లతలు, గృహ పరిసరాలను మనోహరంగా రూపొందిస్తాయి అయితే గృహావర ణలో ఏయే చెట్లు పెంచాలి, ఏయే మొక్కలు పెంచ కూడదు అనే విషయాన్ని మన ఋషులు నిర్దేశించి యున్నారు.

గృహావరణలో వేపచెట్టు ప్రముఖ స్థానం ఆక్రమిస్తుంది. ఈ చెట్టు అన్ని దిశలయందు ఉండవచ్చును. రెండవది మామిడి చెట్టు ఈ చెట్టు దక్షిణము, పడమర, నైఋతి దిశలయందు మాత్రమే ఉండుట శ్రేష్టము. కొబ్బరి చెట్లు ఇంటికి దూరముగా దక్షిణ, పశ్చిమ, నైఋతి దిశలయందుమాత్రమే పెంచవ చ్చును. గృహావరణయందు తూర్పు, పడమర, దక్షిణ దిశలయందు పనస చెట్టు ఉన్నయెడల వాస్తు దోషములను హరించునని శాస్త్రము చెప్పు చున్నది. నారింజ, నిమ్మ, పనస మొదలగు ఫలవృక్షములు ఇంటి ఆవరణలో పెంచుకొ నవచ్చును. ఎఱ్ఱ మందారము ఇంటికి ఆగ్నేయమున పెంచరాదు.

## ఇంటి ఆవరణలో పెంచకూడని చెట్లు :-

రేగుచెట్టు, అరటిచెట్టు, దానిమ్మ,గజనిమ్మ, ఈ నాలుగు చెట్లు ఇంటి ఆవరణలో ఎంతమాత్రము పెంచరాదు. పాలుగారే వృక్షాలలో బొప్పాయి చెట్టు ఇంటి సమీపంలో పెంచరాదు. తుమ్మ మొదలైన ముండ్ల చెట్లు ఇంటి ఆవర ణలో పెంచరాదు. ఇంటి ఆవరణలో మునగ చెట్లు పెంచరాదు.

ముఖ్య గమనిక :- ఇంటి గర్భము ఎంత ఎత్తుగలదో అంతదూరము ఇంటికి ఖాళీ స్థలము విడచి అటు తరువాత గల స్థలములోనే ఏ విధమైన చెట్లుగాని, పొదలు, లతలుగాని పెంచవలెను.

## గృహ నిర్మాణ ప్రయోజనము
## గృహారంభ నియమాలు

స్త్రీపుత్రాదిక భోగసౌఖ్యజనకం ధర్మార్థకామప్రదమ్।
జంతూనాం నిలయం సుఖాస్పదమిదమ్ శీతాంబుఘర్మాపహమ్
వాపీదేవ గృహాది పుణ్యమఖిలమ్ గేహాత్సముత్పద్యతే
గేహం పూర్వముశంతి తేన విభుధాః శ్రీవిశ్వకర్మాదయః॥

వాస్తురాజవల్లభము

పై వాస్తు ప్రమాణమునను సరించి ధర్మార్థకామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములకు గృహమే ముఖ్య సాధనమని బుజావగుచున్నది. గృహస్తుడు తానాచరించు సమస్త శ్రౌత స్మార్త కర్మలను తన స్వగృహమునందు కాక ఇతరుల ఇంటియందాచరించినచో ఆయా శ్రౌత స్మార్త కర్మల యొక్క ఫలితము ఆయా గృహ యజమానికే చెందగలవని శాస్త్రములు చెప్పుచున్నవి. అందుచే ప్రతి గృహస్తుడు తనకొక సొంత ఇల్లు నిర్మించుకొనుట ముఖ్యావసరమగుచున్నది. అంతేగాక శీత వాతాతపాదులనుండి ప్రకృతి సహజముగా కలుగు కష్ట నష్టములనెదుర్కొని గృహమే గృహస్తుని సంరక్షించి సుఖపెట్టుచున్నది. అందుచేతనే మయవిశ్వకర్మ, నారద, సనత్కుమార ఋషి పుంగవులు మానవునకు గృహనిర్మాణము ప్రథమ కర్తవ్యముగా చెప్పిరి.

కోటిఘ్నం తృణజేపుణ్యం మృణ్మయే దశశం గుణం
ఇష్టికే శతకోటిఘ్నం శైల లేనంతం ఫలంగృహే।

అని గృహ నిర్మాణ ఫలితమునుగూర్చి శాస్త్రములు చెప్పుచున్నవి. కావున ప్రతిమానవునకు స్వగృహముండుట అత్యవసరము. అట్టి ఇల్లు అర్హతానుసారముగా ఉండుట మంచిది. అందుచేతనే అతిప్రాచీన కాలము నుండి గృహావసరమైన పరిశీలనలు సాగినవి. లోకహితమే పరమాదర్శముగా గల శిల్ప

ఋషిగణములు తమ అతీంద్రియ శక్తులతో అహర్నిశలు పరిశ్రమించి గృహ నిర్మాణ విధులు వాటి శుభాశుభ ఫలితములు అను విషయముల పై అనేక పరిశోధనలు జరిపి వాస్తు శాస్త్రరూపమున వాటిని గ్రంథస్థము చేసిరి. వారు చేసిన పరిశోధనలను ప్రస్తుత శాస్త్రవేత్తలు కనీసము అర్థము చేసికొను ప్రయత్నము చేసినచో భారతీయుల శాస్త్రపరిశోధనా నిపుణత ప్రపంచ ప్రసిద్ధినొందగలదు.

గృహ నిర్మాణమున ప్రధానమైనది ''శంకు స్థాపన''. దీనినే గృహారంభము అని కూడా అందురు. ఒక శుభముహూర్తమున గృహ నిర్మాణము చేయదలచినస్థలమునందు స్థపతితోకూడి పుణ్యాహవాచనమాచరించి నిర్మాణ ప్రదేశమున స్థపతిచే నిరూపింపబడిన నిర్మాణపు నమూనాయందలి ఈశాన్య కోణమునందుకాని, గర్భగృహమునకు ఈశాన్యప్రదేశమున లేదా తూర్పు, ఉత్తర దిశలయందైననూ స్థపతి నిర్దేశించిన విధముగా వాస్తుపూజ చేసి గర్భనిక్షేపము చేయవలయును. యజమాని భార్య 7 మాసముల గర్భవతియైనచో శంకుస్థాపన చేయకూడదు. ఆరు మాసముల లోపు గర్భవతియైనచో శంకుస్థాపన చేయవచ్చును. ఒకొక్క పర్యాయము ప్రభుత్వ స్థలములందు, చెరువులు, బావుల నిర్మాణ విషయములందు కూడ నిర్మాణ ప్రదేశములకు దగ్గరి ప్రదేశములయందు ఆవరణలో శంకుస్థాపన చేయు సాంప్రదాయమున్నది. కుటుంబమునందలి పెద్దవారితోకూడ శంకుస్థాపనచేయించు ఆచారమున్నది కొందరు ఆగ్నేయకోణమునందు శంకుస్థాపన చేయించు చున్నారు. ఈ పద్ధతి స్తంభ ప్రతిష్ఠ విషయమై, కశ్యపముని చెప్పియున్నారు. కావున మానవ నివాస గృహముల విషయములో ఈశాన్య, తూర్పు, ఉత్తర దిశలయందు ప్రథమేష్టికాన్యాసము చేయుట శుభప్రదము. ఈ కాలమున అధిక సంఖ్యాకులు ప్రథమేష్టికాన్యాసమే చేయుచున్నారు. అనగా ఇటుకలతో గర్భన్యాసముచేయుట. ద్వాదశాంగుళ శంకువును నిర్మించి దానిని వాస్తుపురుషుని నాభిప్రదేశమున స్థాపించు ఆచారము చాల చోట్ల కనుమరుగైనది ప్రథమేష్టికాన్యాసము శాస్త్రసమ్మతమే

నని అపరాజితపృచ్ఛ మొదలగు గ్రంథములు చెప్పుచున్నవి. ఈ గృహారంభము నకు ముహూర్తముకూడ చాల ప్రధానమైనది. ముహూర్త బలము వలన జాత కమునందలి వ్యతిరేక పరిస్థితుల యందు కొంత అనుకూలత యేర్పడి గృహ నిర్మాణ విషయమున తోడ్పడగలదు. కావున యజమాని సమర్థుడగు స్థపతి సూచనననుసరించి నిర్మాణపు నమూనాను, ముహూర్తమును సరిచేయించు కొని గృహనిర్మాణమును ప్రారంభింప వలెను.

గృహ నిర్మాణమునందు గృహారంభమునకు ముందు భూమిని పూజించి స్థలమును శుభ్రముచేసి సమర్థుడగు దైవజ్ఞుడైన స్థపతిచేత శల్యవిషయమై స్థల శోధన చేయించి తదుపరి నిర్మాణపు నమూనాతో స్థలమునందు ముగ్గువేసి ఎచట శంకుస్థాపనలేక ప్రథమేష్టికాన్యాసము చేయవలెనో అచటగర్తము (గొయ్యి) తీయించవలెను. తదుపరి శుభలగ్నమున గృహారంభము చేయవలెను.

స్థిరవాస్తు పురుషుననుసరించి శంకుస్థాపన, చరవాస్తు పురుషుని అను సరించి గృహారంభము చేయవలయును. ఏకాశీతి పదవాస్తువునుసరించి సిరా మర్మ భేదమును గుర్తింపవలెను. సిరామర్మ భేదముననుసరించి గుమ్మాలు కిటికీలు సూచించ వలెను. గృహారంభమైనదిలగాయతు ఒక సంవత్సరము లోపున గృహ ప్రవేశము చేయవలయునను నియమము కొందరు చెప్పుచు న్నారు. కాని ఈ నియమము ప్రమాణ గ్రంథములలో కనిపించుటలేదు. ఈ నియమము అసమంజసము కూడా పెద్ద భవనములు ఒక సంవత్సర కాలము నందు నిర్మించుట కష్టము. కావున యజమాని వీలైనంత తొందరగా గృహ నిర్మాణమును పూర్తిగావించుకొని గ్రహానుకూలము కలిగిన సమయమున గృహ ప్రవేశము చేయుట మంచిది.



## గృహప్రవేశ నియమములు

సమస్త శుభలక్షణ సంపన్నమైన విధముగా గృహ నిర్మాణము చేసిన పిమ్మట ఒక శుభముహూర్తమున యజమాని కుటుంబ బంధుమిత్ర పరివార సహితుడై గృహప్రవేశము చేయవలెను.

యజమాని భార్యా సహితుడై పట్టువస్త్రములు ధరించి తమకు పురోభాగమున గోవును, తదుపరి నీళ్ళ బిందెలు భుజమున ధరించిన ముత్తైదువులు, స్థపతియు, శిల్పియు, పురోహితుడు నడుచుచుండ వారిననుసరించి పూర్ణ కలశమును చేతనుంచుకొని బంధుమిత్రాదులు తాము పరివేష్టించి వచ్చుచుండ మంగళతూర్యధ్వనులతో నూతన గృహమును సమీపించి ముందుగ గృహమునకు ప్రదక్షిణ చేయ వలెను. అట్లు మొదటి ప్రదక్షిణ చేయు సమయమున ఈశాన్యమాదిగాగల ఎనిమిది దిక్కులయందు వాస్తుపద బాహ్య దేవతలకు వాస్తు బలులు సమర్పించవలెను.

| | | |
|---|---|---|
| 1. | ఈశాన్యమున | చరకీదేవత |
| 2. | తూర్పున | సర్వస్కంధ |
| 3. | ఆగ్నేయమున | విదారిక |
| 4. | దక్షిణమున | అర్యమ |
| 5. | నైఋతియందు | పూతన |
| 6. | పడమరయందు | జంభిక |
| 7. | వాయవ్యమున | పాప రాక్షసి |
| 8. | ఉత్తరమున | పిలిపించక |

ఈ పైన చెప్పిన ఎనిమిది దిక్కులయందు ఆయా దేవతల పేరున ఎర్రని అక్షతలు టెంకాయ సమర్పించి పిమ్మట ప్రదక్షిణములు పూర్తిచేసి ఆ తరువాత నిర్ణయించుకొన్న సుముహూర్తమునకు గృహసింహద్వారమును సమీపించి

ఆయా ప్రాంతీయ ఆచార విధులు నిర్వహించి ముందుగా గోవును ద్వారమును దాటించి పిమ్మట పూర్ణ కుంభములతో ముత్తైదువులు ముందు నడవగా యజమాని ధర్మపత్నితో కుడిపాదమును ముందుంచి నూతన గృహప్రవేశ ముహూర్తమును చేయ వలెను. దీనికే శాస్త్రములయందు గృహప్రవేశమని చెప్పబడినది. కొన్ని ప్రాంతములయందు ముహూర్తమునకు ముందుగా గృహ ప్రవేశము చేసి ముహూర్తకాలమునకు అగ్నిప్రతిష్ఠ చేయుటయో లేక పాలలో పిడికెడు బియ్యము వేయుటో చేయుచున్నారు. ఇది శాస్త్రవిరుద్ధమగు కార్యము. పైన చెప్పిన విధముగా యజమాని గృహ ప్రవేశమొనర్చిన పిమ్మట గణపతి పూజ, పుణ్యాహవాచనము, వాస్తుమండపారాధన, బ్రహ్మమండపారాధన అగ్ని ప్రతిష్ఠ, వాస్తుహోమము నిర్వహించి పిమ్మట స్థపతిని, శిల్పిని, పురోహితుని యథాశక్తి నూతన వస్త్ర తాంబూలాది సత్కారములతో తృప్తిపరచి వారి ఆశీర్వచనములు పొంది తన శక్తికొలది అన్నశాంతి జరుపవలెను. అట్లు శాస్త్రోక్త విధిగా గృహప్రవేశ కార్యము జరిపించిన కర్త సమస్త సౌఖ్యములు పొంది సుఖించును. గృహ నిర్మాణము పూర్తియైన పిమ్మట గృహమును చిరకాలము విడువ రాదు.

